


నవంబర్ 2018

# కార్తిక సందేహాలు సమాధానాలు



# బిల్వాష్టకం

త్రిదళం త్రిగుణాకారం త్రినేత్రం చ త్రియాయుధం
త్రిజన్మపాపసంహారం ఏకబిల్వం శివార్పణమ్

త్రిశాఖైర్బిల్వపత్రైశ్చ హ్యచ్ఛిద్రైః కోమలైశ్శుభైః
శివపూజాం కరిష్యామి ఏకబిల్వం శివార్పణమ్

అఖండబిల్వపత్రేణ పూజితే నందికేశ్వరే
శుద్ధ్యంతి సర్వపాపేభ్యః ఏకబిల్వం శివార్పణమ్

సాలగ్రామశిలామేకాం జాతు విప్రాయ యోఽర్పయేత్
సోమయజ్ఞమహాపుణ్యం ఏకబిల్వం శివార్పణమ్

దంతికోటిసహస్రాణి వాజపేయశతాని చ
కోటికన్యామహాదానాం ఏకబిల్వం శివార్పణమ్

పార్వత్యాస్స్వేదతోత్పన్నం మహాదేవస్య చ ప్రియం
బిల్వవృక్షం నమస్యామి ఏకబిల్వం శివార్పణమ్

దర్శనం బిల్వవృక్షస్య స్పర్శనం పాపనాశనం
అఘోరపాపసంహారం ఏకబిల్వం శివార్పణమ్

మూలతో బ్రహ్మరూపాయ మధ్యతో విష్ణురూపిణే
అగ్రతశ్శివరూపాయ ఏకబిల్వం శివార్పణమ్

బిల్వాష్టక మిదం పుణ్యం యః పఠేచ్ఛివసన్నిధౌ
సర్వపాపవినిర్ముక్తః శివలోక మవాప్నుయాత్



# కార్తిక దీపం

ఏకబిల్వం శివార్పణం అంటూ కార్తికమాసంలో (నవంబర్ 8 నుంచి డిసెంబర్ 7 వరకు) ఒక్క మారేడు దళాన్నైనా శివలింగంపై ఉంచితే చాలు. నమకచమకాలు రాకపోయినా ఓం నమశ్శివాయ చెబుతూ కాసిన్ని నీళ్లు శివలింగంపై పోయగలిగితే చాలు. ఒక్క సోమవారం నాడైనా నక్షత్రదర్శనం వరకు శివారాధనలో గడిపి భుజించగలిగితే చాలు. హరోంహర శంకరా అంటూ నెలరోజుల్లో ఒక్క పర్వతిథినాడైనా పుణ్యనదుల్లో మునకవేస్తే చాలు. ఆకాశదీపాన్ని దర్శించినా చాలు. నదీమతల్లి ఒడిలో ఉయ్యాలలూగే దీపానికి నమస్కరించినా చాలు. వేలాది దీపాలు స్వయంగా వెలిగించలేకపోతేనేం... దీపోత్సవాలలో ఒక్కరోజు పాల్గొన్నా చాలు. ఉసిరికాయపై నిలబెట్టిన దీపం దానం చేసినా చాలు. ఒకరు వెలిగించిన దీపాన్ని దోహదం చేసి మరికాసేపు వెలిగేలా చేసినా చాలు.

**ఇహ జన్మని యత్పాపం యత్పాపం పూర్వ జన్మని**
**తత్పాపం విలయం యాతి కార్తిక వ్రతముత్తమమ్**

ఈ జన్మలో, కిందటి జన్మలో చేసిన పాపాలన్నీ కార్తిక నియమాలను పాటిస్తే చాలు తొలగిపోతాయంటారు. సూర్యోదయానికి పూర్వమే చన్నీటి స్నానం, ఉభయ సంధ్యలలోనూ దీపారాధన చేయడం కార్తికంలో ముఖ్యవిధులు. వాటితో పాటుగా వనభోజనం, నక్షత్రదర్శనం, కార్తిక పురాణ శ్రవణం తప్పనిసరిగా చేయాలి. తీర్థాలు, క్షేత్రాలు సేవించే భాగ్యం.... సాధుసత్పురుషులను దర్శించిన ఫలం.... పరమశివుని సన్నిధిలో దీపారాధన చేసే సదవకాశం దీపోత్సవాలలో భక్తుల పరమవుతుంది. కార్తికంలో తప్పనిసరిగా పాటించాల్సిన నియమాలు, కార్తికదీపారాధన చేసే సందర్భంలో వచ్చే అనేక సందేహాలు, కార్తికమాసంలో శివపరంగా వచ్చే సందేహాలకు సమాధానాలను ఈ చిరుపుస్తకంతో **భక్తిపత్రిక** పాఠకులకు అందిస్తున్నాం... అందుకోండి.

**వేదాంత వేద్యాయ నమశ్శివాయ**
**జ్యోతిస్వరూపాయ నమశ్శివాయ**





**కార్తికమాసం**

**నవంబర్ 8 నుంచి డిసెంబర్ 7 వరకు**



RNI Regn.No.TELTEL/2015/66688 | Postal Regd.No. HCD-5002/2016-2018
Date of Posting : 28th of every month | Date of Publication : 25th of every month



# కార్తికంలో తప్పకుండా చేయాల్సిన పనులేవి?

**స్నానం, దీపం, చ దానం చ**
**పురాణ శ్రవణం ద్విజాత్**
**లక్ష బిల్వార్చనం చైవ వనభోజన మాచరేత్**

★ సూర్యోదయానికి ముందే నిద్రలేచి స్నానం చేయాలి. కార్తికమాసంలో చంద్రకిరణాలు సోకిన నీటితో స్నానం చేయడం వల్ల ఆరోగ్యం సిద్ధిస్తుంది. నదీస్నానం ఉత్తమం. ఆరుబయట చంద్రకిరణాలు సోకిన నీటితో అయినా స్నానం చేయవచ్చు. అనారోగ్య కారణాల వల్ల స్నానం చేయడం కుదరకపోతే శివుణ్ణి మనసులోనే స్మరించి మానసస్నానం అయినా చేయాలి.

★ దేవుని వద్ద దీపం వెలిగించాలి. కార్తికమాసంలోనే కాకుండా ఏడాది పొడవునా దేవుని వద్ద రెండుపూటలా దీపం వెలిగించడం ఉత్తమం. కార్తికంలో దీపారాధన చేస్తే ఏడాది పొడవునా చేసిన ఫలితం లభిస్తుంది. కార్తిక పౌర్ణమినాడైనా దీపారాధన తప్పనిసరిగా చేయాలి.

★ ఉన్నంతలో లేనివారికి దానం చేయాలి. మానవసేవయే మాధవసేవగా భావించాలి. పవిత్రమాసాల్లో చేసిన దానాలకు రెట్టింపు ఫలితం వస్తుందని ధర్మశాస్త్ర గ్రంథాలు చెబుతున్నాయి.

★ కార్తిక పురాణంలో చెప్పిన మంచి విశేషాలను వినాలి. స్మరించుకోవాలి.

★ కార్తికంలో శివునికి ప్రధానంగా లక్షమారేడు దళాలతో సమూహంగా పూజ చేస్తారు. అలాగే విష్ణుమూర్తిని కార్తిక దామోదరునిగా పూజిస్తారు. శివకేశవులిద్దరికీ ఇది ప్రీతికరమైన మాసం.

★ పెద్ద ఉసిరి, తులసి, మామిడి, మారేడు, జమ్మి మొదలైన దేవవృక్షాలున్న వనంలో భక్తిశ్రద్ధలతో సామూహిక వనభోజనాలు చేయాలి. ఉసిరిచెట్టు మొదట్లో విష్ణుస్వరూపమైన సాలిగ్రామాన్ని పూజించాలి. సాలిగ్రామం లభ్యంకాకుంటే విగ్రహాన్ని కానీ పటాన్ని కానీ పెట్టి పూజించవచ్చు. వనాలకు వెళ్లి భోజనం చేసే అవకాశం లేనప్పుడు కుండీల్లో కొమ్మలు పాతి, పూజించుకోవచ్చు. ఇది కార్తికమాసంలో మన సంప్రదాయం.


RNI Regn.No.TELTEL/2015/66688 | Postal Regd.No. HCD-5002/2016-2018
Date of Posting : 28th of every month | Date of Publication : 25th of every month

# కార్తిక స్నానానికి ఎందుకంత ప్రాధాన్యం?

కార్తికంలో గోష్పాదమంత (ఆవుకాలిగిట్ట) జలంలో కూడా ఆ దేవదేవుడు ఉంటాడని విశ్వసిస్తారు భక్తులు. అందుకే కార్తికమాసంలో స్నానానికి అంత ప్రత్యేకత ఉంది. ఈ మాసంలో సూర్యోదయానికి ముందుగా చేసే స్నానాన్ని హంసోదక స్నానం అంటారు. శరదృతువులో సూర్యోదయానికి ముందు హంసమండలానికి సమీపంలో అగస్త్య నక్షత్రం ఉదయిస్తుంది. అటువంటి సమయంలోని నీరు స్నానపానాదులకు అమృతతుల్యంగా ఉంటుందని మహర్షి చరకుడు పేర్కొన్నాడు. ఓషధులకు రాజు చంద్రుడు. చంద్రకిరణాలు సోకిన నీటితో సూర్యోదయానికి ముందే స్నానం చేయాలి. శరదృతువులో నదీప్రవాహంలో ఓషధుల సారం ఉంటుంది. **అప్సుమే సోమోబ్రవీత్ - అంశర్విశ్వాని భేషజం** అని కృష్ణయజుర్వేదం పేర్కొంటోంది. చీకటి ఉండగానే ఉషఃకాలంలో అంటే సూర్యోదయానికి పదిహేను నిమిషాల ముందు స్నానం చేయడం ఉత్తమం. ఇందువల్ల మానసిక, శారీరక రుగ్మతలన్నీ నశిస్తాయి. పరిపూర్ణ ఆరోగ్యం కలుగుతుంది. ఆయుష్షు పెరుగుతుంది.

స్నానం తరువాత తడిపి, నీళ్లుపిండివేసిన వస్త్రంతో తుడుచుకోవాలి. లేదా ఉతికిన పొడివస్త్రం ఉపయోగించాలి. తడిగుడ్డలతో దైవకార్యాలు చేయకూడదు. పితృకర్మలూ, పిండప్రదానాలూ మాత్రం చేయవచ్చు. ప్రాతఃకాలంలో అయిదుగంటలకు పూర్వం చేసే స్నానం ఋషి స్నానం. మిక్కిలి శ్రేష్టమైనది. అయిదు నుంచి ఆరులోపుగా చేసేది దేవస్నానం. ఆరు నుంచి ఏడులోపు మానవస్నానం. ఆ తర్వాత చేసేది రాక్షస స్నానం. అనారోగ్యం వల్లనో, మరే కారణం వల్లనో స్నానం చేయలేకపోతే నిర్మలహృదయంతో నిరంజనుణ్ణి స్మరించడం మానస స్నానం అవుతుంది. విష్ణుపాదోదకంతో కానీ, తులసి, మారేడు దళాలు కలిసిన జలంతో కాని సంప్రోక్షించుకుంటే ధ్యాన స్నానమవుతుంది. ఎండా, వాన కలిసినప్పుడు తడిస్తే అది దివ్యస్నానం. తడివస్త్రం చేత దేహాన్ని తుడుచుకుంటే కపిలస్నానం అనిపించుకుంటుంది. ఆపోహిష్టామయోభువః అనే మంత్రాన్ని జపిస్తూ సంధ్యావందనాది సందర్భాలలో జలాన్ని ప్రోక్షించుకుంటే మంత్రస్నానం అవుతుంది. మహిమాన్వితమైన గాయత్రీమంత్రాన్ని జపిస్తూ నీటిని అభిమంత్రించి శిరస్సుమీద చల్లుకుంటే గాయత్రీ స్నానమవుతుంది. దీనివల్ల సకల గ్రహదోషాలు తొలగిపోతాయి. కార్తికపౌర్ణమికి వీలైనవారు సముద్రస్నానం చేయవచ్చు.





## దీపారాధన చేయడం వల్ల కలిగే సత్ఫలితాలు ఏవి?

★ దీపం వెలిగేచోట లక్ష్మినివాసం ఉంటుంది. దరిద్రాలు తొలగి, ఐశ్వర్యాలు లభిస్తాయి. దేవతాశక్తులు స్థిరనివాసం చేస్తాయి.

★ దీపం వెలిగించి పూజాదికాలు చేస్తే, విఘ్నకారకాలైన తామస శక్తులు, రాక్షస భూతప్రేత పిశాచాలు దరిచేరవు.

★ దీపారాధన క్రమంగా మనలో జ్ఞానాన్ని వికసింప చేస్తుంది.

★ దీప ప్రజ్వలన వల్ల ఉత్తమలోకాలు లభిస్తాయి.

దేవతాలోకాలుగా చెప్పే ఊర్ధ్వలోకాలన్నీ కాంతిలోకాలు. అధోలోకాలన్నీ చీకటిమయాలు. జ్యోతిని వెలిగించడం వల్ల జీవునికి మంచి గతులు లభిస్తాయి. పుణ్యలోకాలు సిద్ధిస్తాయి. మరణించిన వ్యక్తులకు ఉత్తమ గతులు సిద్ధించాలన్నా దీపాలు వెలిగించాలని శాస్త్రాలు చెబుతున్నాయి. దీపావళినాడు దీపాలు వెలిగించడం, కొరివి రగిలించడం, దివిటీలు వెలిగించడం వల్ల మరణించిన పెద్దలకు ఉత్తమగతులు కలగాలనే ఉద్దేశ్యంతో చేస్తారు. సంధ్యాసమయాలలో దీపం వెలిగే ఇంట దైవీశక్తులుంటాయి. అటువంటి ఇంటిలో రోగాలు, నిరుత్సాహం, కలహాలు, దరిద్రం మొదలైన బాధలుండవు.



## కార్తిక దీపారాధన ప్రాశస్త్యం ఏమిటి?

**దీపదో లభతే విద్యాం దీపదో లభతే శ్రుతం**
**దీపదో లభతే చాయుః దీపదో లభతే దివమ్**

దీపం వెలిగించినవారు విద్యావంతులు, జ్ఞానవంతులు, ఆయుష్మంతులవుతారు. మోక్షాన్ని పొందుతారు. సాయంత్రం శివాలయంలో దీపం వెలిగిస్తే అనంతమైన పుణ్యం లభిస్తుంది. అప్రయత్నంగా అయినా, భక్తిభావన లేకపోయినా దీపం వెలిగించినందువల్ల అనంత పుణ్యఫలం వస్తుంది. ఇదే ఫలితం విష్ణుభక్తులకు కూడా వస్తుంది. కార్తికమాసం నెల రోజులూ దీపాలు పెట్టటం సంప్రదాయం.. ఆచార విధి కూడా. ఏదైనా కారణం వల్ల 30 రోజులు దీపం పెట్టలేని వారు కనీసం శుద్ధ ద్వాదశి, చతుర్దశి, పూర్ణిమ రోజుల్లో అయినా దీపం వెలిగిస్తే, వైకుంఠప్రాప్తి కలుగుతుంది. కార్తిక మాసంలో శనిత్రయోదశి కన్నా సోమవారం ఎక్కువ ఫలితాన్నిస్తుంది. శనిత్రయోదశి కన్నా కార్తిక పూర్ణిమ వందరెట్లు ఎక్కువ ఫలితాన్నిస్తుంది. పూర్ణిమ కన్నా బహుళ ఏకాదశి కోటి రెట్లు పుణ్యఫలితాలు అనుగ్రహిస్తుంది. బహుళ ఏకాదశి కన్నా క్షీరాబ్ధి ద్వాదశి అతి విస్తారమైన, అనంతమైన ఫలితాన్నిస్తుందని భాగవతం చెబుతోంది. ఈ రోజుల్లో తప్పనిసరిగా దీపారాధన చేయాలి.


RNI Regn.No.TELTEL/2015/66688 | Postal Regd.No. HCD-5002/2016-2018
Date of Posting : 28th of every month | Date of Publication : 25th of every month

# దీపావళి అమావాస్య నుంచి కార్తిక అమావాస్య వరకు ఇంటివద్ద దీపాలంకరణ ఎలా చేసుకోవాలి?

సకల ఐశ్వర్యప్రదాయకుడైన శివుడు అష్టమూర్తి. లక్ష్మీదేవికి ఇష్టమైన సంఖ్య కూడా ఎనిమిది. మన దిక్పాలకులు ఎనిమిదిమంది. దీపావళి అమావాస్యనాడు ఎనిమిది దిక్కుల్లోనూ ఉండే దేవతలను మనకు ఐశ్వర్యాన్ని ఇమ్మని ప్రార్థిస్తూ దీపాలను వెలిగిస్తాం. ఈ క్రమంలో ఎనిమిది దీపాలు వెలిగించడం ఉత్తమం.

దీపావళి అమావాస్యనాడు ఎన్ని దీపాలైనా వెలిగించవచ్చు. వాటిమధ్యలో ఒక దీపం వెలిగించాలి. వీధిగుమ్మానికి రెండువైపులా, పెరటి గుమ్మానికి రెండువైపులా వెలిగించాలి. ఇంటిలోపలి గదుల్లోకి కాకుండా బయటకు వెళ్లే గుమ్మాలు ఎన్ని ఉంటే అన్ని గుమ్మాల వద్ద రెండువైపులా దీపాలు వెలిగించవచ్చు. ఎన్ని దీపాలు వెలిగించాలనే విషయంలో సంఖ్యా పరిమితి లేదు. సాధ్యమైనన్ని వెలిగించుకోవచ్చు. తులసికోట వద్ద, దేవుని వద్ద తప్పనిసరిగా దీపం వెలిగించాలి.అపార్టుమెంట్ల విషయానికి వస్తే సెల్లార్, పార్కింగ్ లాంటి ఉమ్మడి స్థలాల్లో శుభ్రంచేసి, పిండిముగ్గువేసి దీపాలు పెట్టుకోవచ్చు. శుభం కలుగుతుంది.

దీపావళి వెళ్లిన మరునాటి నుంచి వీధివైపు, పెరటివైపు కనీసం రెండేసి దీపాలైనా వెలిగించుకోవచ్చు. ఉదయం – సాయంత్రం రెండుపూటలా ఈ విధంగా చేయవచ్చు. తులసికోటవద్ద, దేవునివద్ద నిత్యం ఒక్క ప్రమిదలో అయినా దీపాలు వెలిగించాలి. దీపాలలో అనేక రకాలున్నాయి. దేని ప్రత్యేకత దానిదే. దేని ఫలితం దానిదే. అఖండదీపం వెలిగించడమే దీపయజ్ఞం. ఉసిరికాయపై దీపం వెలిగించి బ్రాహ్మణులకు దానం చేస్తారు. కార్తికమాసం నెల్లాళ్లూ శివాలయాల్లో ఆకాశదీపం పెడతారు. పౌర్ణమి, పోలిస్వర్గదీపం పర్వాల్లో అరటిదొప్పల్లో దీపాలను నీటిలో వదులుతారు. క్షేత్ర దర్శనం తర్వాత నదీ దేవతకు దీపం వెలిగించి, హారతి ఇస్తే వరుణలోకప్రాప్తి కలుగుతుంది.



కార్తికమాసంలో ఎక్కడ దీపం వెలిగించినా దేవతా ప్రీతి కలుగుతుంది. ఆలయం, దీపోత్సవం, నదీతీరం, వనం, ఇలా అన్నిచోట్లా దీపారాధన చేయవచ్చు. స్వయంగా దీపం వెలిగించినా, వేరొకరు వెలిగించిన దీపాన్ని చూసినా, దీపం కొండెక్కకుండా కాపాడినా పుణ్యమే.


RNI Regn.No.TELTEL/2015/66688 | Postal Regd.No. HCD-5002/2016-2018
Date of Posting : 28th of every month | Date of Publication : 25th of every month

## కార్తికమాసంలో నెలరోజులూ దీపాలు వెలిగించలేని వారికి ప్రత్యామ్నాయం ఏమిటి?

నిత్యం తులసికోట వద్ద, పూజగదిలో దీపారాధన చేయవచ్చు. ఏదైనా కారణం వల్ల కొన్నిరోజులపాటు దీపారాధన చేసే అవకాశం లభించకపోవచ్చు. దానికి చింత పడనవసరం లేదు. ప్రత్యేకించి కార్తికమాసంలో దీపోత్సవాలు విశిష్టమైన ఫలితాలు కలిగిస్తాయి. అందరూ కలిసి సామూహికంగా నిర్వహించుకునే దీపారాధన కార్తికమాసంలో మాత్రమే చేయడం చూస్తుంటాం. అటువంటి దీపోత్సవాల్లో పాల్గొనవచ్చు. కనీసం కార్తిక పౌర్ణమినాడు లేదా ఆ మాసంలో ఏదైనా ఒక రోజున ఆలయంలో, నదీతీరంలో, పూజగదిలో, తులసికోటవద్ద దీపారాధన చేయడం మంచిది. కార్తికపౌర్ణమినాడు సంవత్సరం మొత్తానికి గాను 366 వత్తులను వెలిగించే సంప్రదాయం ఉంది. ఆనాడు దీపారాధన చేస్తే ఏడాది మొత్తం దీపారాధన చేసిన ఫలితం లభిస్తుంది.



## కార్తికమాసంలో ఉసిరికాయపై దీపం ఎందుకు వెలిగిస్తారు?

**వైరాగ్య తైల సంపూర్ణే భక్తివర్తి సమన్వితే.** దీపం వెలిగించడానికి ఓ ప్రమిద కావాలి. అదే మానవ దేహం. పృధివీతత్త్వం. వైరాగ్యంతో కూడిన తైలం, నూనె కావాలి. ఇది జలతత్త్వం. భక్తి అనే వత్తి అందులో ఉంచాలి. అది ఆకాశ తత్త్వం. వెలిగించడానికి అగ్ని కావాలి. వెలిగించిన తర్వాత ఆ దీపం అఖండంగా వెలగడానికి గాలి కావాలి. అది వాయుతత్త్వం. ఇలా పంచతత్త్వాలతో కూడినదే దీపం. మానవునిలో ఉండే ఈ పంచతత్త్వాలకు ఊపిరిపోసే ఉసిరికను దీపశిఖకు ఆధారంగా చేస్తాం. దేహంపై మమకారం వదలిపెట్టడానికి, అజ్ఞానం తొలగి జ్ఞానం పొందడానికి కార్తిక దీపదానం చేస్తాం.

## కార్తికమాసంలో దేవుని దగ్గర పెట్టిన దీపం ఎంతసేపు వెలగాలి?

దీపం వెలగవలసిన సమయం తక్కువ కాకుండా చూసుకోవడం అవసరం. దీపం కనీసం గోదోహన కాలంపాటు వెలగాలన్నారు. అంటే ఆవుపాలు పితికేందుకు పట్టేంత కాలమైన దీపం వెలగాలని అర్థం. సామాన్య పరిభాషలో అరగంట దాకా వెలిగేంత చమురుపోసి దీపారాధన చేయాలి. అలాగే పూజా పూర్తయ్యాక మనంతట మనమే దీపం ఆర్పకూడదు. దానంతట అది ఆరిపోయేవరకు అలా ఉంచాలి. పూజమధ్యలో దీపం ఆరిపోకుండా చూసుకోవాలి. దీపం ఆరింది అనడం కూడా అపశకునంగా భావిస్తారు. దీపం కొండెక్కింది లేదా ఘనమయ్యింది అంటూ ఉంటారు.



## ఎన్ని వత్తులతో దీపారాధన చేయాలి?

సాధారణంగా దీపారాధన కుందులలో ఒకటి, మూడు, ఐదు వత్తులు పెట్టేందుకు వీలుగా తయారైనవి ఉంటాయి. ఒకటి పెట్టే వీలున్న కుందులు కూడా మార్కెట్లో లభ్యమవుతున్నాయి. వత్తిని కిందినుంచి పైకి రంధ్రంద్వారా ఎక్కించి పైన వెలిగిస్తారు. అలాంటి కుందిలో దీపారాధన చేసేట్లయితే కనీసం రెండు కుందుల్లో దీపారాధన చేయాలి. అంటే రెండుదీపాలు వెలిగించాలన్నమాట. మామూలుగా పత్తినుంచి తీసిన సన్నని దారపుపోగును మూడుసార్లు మూడువేళ్ల చుట్టూ తిప్పితే వత్తి తయారవుతుంది. ఈ తరహా వత్తిని ప్రమిదలో వేసి ఒక కొన పైకి వచ్చేలా పెడతారు. అక్కడ నూనెతో తడిపి దీపం వెలిగిస్తారు. మూడువత్తులను కలిపి ఒక వత్తిగా చేసి, త్రివర్తి సంయుక్తంగా దీపం వెలిగించడం ఒక సంప్రదాయం. కొందరు రెండు లేదా అయిదు వత్తులు కూడా పెడతారు. అది సంప్రదాయాన్ని అనుసరించి ఉంటుంది. మరికొందరు కుంభం వత్తి లేదా బొడ్డువత్తి తయారుచేస్తారు. క్రిందగుల్లగా ఉండి ఒకటే కొసపైకి తేలి గరాటులా కనిపించే వత్తి అది.దానిని ప్రమిద మధ్యలో వెలిగిస్తారు. కుంభం వత్తిని సాధారణంగా ఒకటికి మించి వెలిగించరు.

## ఒకసారి వెలిగించిన వత్తిని మళ్లీ వెలిగించవచ్చా?

నేడు వెలిగించిన వత్తిని తీసివేసి రేపటినాడు కొత్త వత్తితో దీపారాధన చేయాలి. ఒకరోజునే వెలిగించిన మూడు వత్తుల్లో ఒక వత్తి శాంతించి మిగిలిన వత్తులు వెలుగుతున్నప్పుడు వాటి సాయంతో కొండెక్కిన వత్తిని వెలిగించవచ్చు. అన్ని వత్తులూ ఒకేసారి శాంతించినప్పుడు కూడా అప్పటికప్పుడే అయితే మరోసారి వెలిగించుకోవచ్చు. ఒకసారి చేసిన దీపారాధనలోని వత్తులు ఆనాటికి మాత్రమే పరిమితం అని గుర్తించాలి.




DEWALI

## దీపారాధనలో వినియోగించే వత్తిని బట్టి ఫలితం ఉంటుందా?

దీపారాధనకు శుద్ధమైన వత్తిని ఎంచుకోవాలి. పత్తితో చేసిన వత్తులు సర్వశ్రేష్ఠమైనవి. అన్నివేళల్లోనూ పత్తివత్తులను ఎవరైనా వెలిగించవచ్చు. తామరతూడులతో వత్తులు చేసి వెలిగిస్తే అఖండభాగ్యం లభిస్తుంది. పితృదోషాలు తొలగుతాయి. అరటివత్తులతో వెలిగిస్తే ఉత్తమ సంతతి. జిల్లేడువత్తులతో వెలిగిస్తే అపారసంపద కలిగి దుష్టశక్తుల పీడ తొలగుతుంది. నూతన వస్త్ర పీలికను కుంకుమనీళ్లలో తడిపి, ఆరబెట్టి దీపారాధన చేస్తే కుజ, శుక్రదోషాలు పోతాయి. పసుపురంగు వస్త్రంతో వత్తిచేసి వెలిగిస్తే దేవీ కటాక్షం సిద్ధిస్తుంది. కుంకుమరంగు వస్త్రంతో చేసిన వత్తితో వెలిగిస్తే సంతానప్రాప్తి కలుగుతుంది. ఎర్రరంగు వస్త్రాన్ని గంధపునీటిలో తడిపి, ఆరబెట్టి దీపారాధన చేస్తే చక్కటి సంతానం కలుగుతుంది. పన్నీరుతో తడిపిన నేతివత్తులతో వెలిగిస్తే కీర్తివంతులవుతారు. తామరనారతో దీపారాధన చేస్తే గ్రహదోషాలు పోతాయి.

### వత్తిని బట్టి ఫలితాలు

**2** దీపారాధనలో రెండువత్తులు వాడడం అన్నివిధాలా మంచిది. ఒకటి అడ్డవత్తి, రెండోది నిలువు వత్తి అయితే ఉత్తమం. లేకపోయినా రెండు నిలువు వత్తులను వెలిగించవచ్చు.



**3** ఉత్తమ సంతానం కలుగుతుంది.

**5** పంచభూతాలకు సంకేతం.

**7** ఏడుజన్మల పాపాలు తొలగిపోతాయి.

**8** అష్టైశ్వర్యాలు సిద్ధిస్తాయి.

**9** కీర్తిప్రతిష్ఠలు పెరుగుతాయి.

**10** సర్వాంతర్యామికి సంకేతం.

**27** నక్షత్రారాధన ఫలితమిస్తుంది.

**108** సర్వారిష్టాలు తొలగుతాయి.

**360** సంవత్సరమంతా దీపారాధన చేసిన ఫలం లభిస్తుంది.

## 360 వత్తులను ఎప్పుడు వెలిగించాలి?

పుణ్యక్షేత్రాల్లో ఎప్పుడైనా వెలిగించవచ్చు. కార్తికమాసంలో పౌర్ణమినాడు వెలిగించడం శ్రేష్ఠం. ఆలయాల్లో, దీపోత్సవాల్లో వెలిగించవచ్చు. ఇంటివద్ద వెలిగించినప్పుడు సాధారణంగా క్షీరాబ్ధి ద్వాదశినాడు తులసికోట వద్ద వెలిగిస్తారు. వీలుకానివారు కార్తికమాసంలో ఏదో ఒకరోజున వెలిగించుకోవచ్చు. 360 వత్తులను ముందుగా ఆవునేతిలో తడిపి సిద్ధం చేసుకోవాలి. మనకు ఉన్న తిథులు మొత్తం 15. నెలకు 30 తిథులు. నెలలు మొత్తం 12. రోజుకు ఒకటి చొప్పున 360 వత్తులు సంవత్సరానికి సంకేతానికి నిలుస్తాయి.


RNI Regn.No.TELTEL/2015/66688 | Postal Regd.No. HCD-5002/2016-2018
Date of Posting : 28th of every month | Date of Publication : 25th of every month



## దీపారాధనకు ఎటువంటి ప్రమిదలు వాడుకోవాలి?

దీపారాధనకు ప్రమిదలను మన సాధనను అనుసరించి ఎంచుకోవాలి. మట్టిప్రమిదల్లో దీపారాధన సర్వవేళల్లోనూ చేయవచ్చు. కంచు, ఇత్తడి ప్రమిదలలో దీపాలు వెలిగిస్తే శాంతి సౌభాగ్యాలు కలుగుతాయి. మట్టి, పింగాణి ప్రమిదలలో వెలిగిస్తే తలచిన కార్యాలు నెరవేరుతాయి. పంచలోహాలతో చేసిన కుందులతో పాటు, వెండికుందులు సర్వశుభప్రదం. శనిదోష నివారణకు నల్లమూకుడు, ఇనుప ప్రమిదల్లో కూడా దీపాలు వెలిగిస్తారు.

## దీపావళి వంటి సందర్భాల్లో ఉపయోగించిన డిజైనర్ దీపాలను ఏం చేయాలి?



దీపావళి పండుగతో మొదలుపెట్టి కార్తికమాసం నెల్లాళ్లూ దీపాలు వెలిగిస్తారు. ఆ తరువాత ఆ మట్టి ప్రమిదలను ఏడాది పొడవునా దాచుకుంటారు. ఏడాది తరువాత శుభ్రపరిచి మళ్లీ వినియోగిస్తారు. మట్టి ప్రమిదలను ఎవరూ తొక్కని చోట పారవేయాలి. డిజైనర్ ప్రమిదలైనా అంతే. వందశాతం మట్టితో తయారుచేసిన ప్రమిదలనే వినియోగించాలి. దేవతామూర్తులతో కూడిన డిజైనర్ ప్రమిదలను వినియోగించడం ఉత్తర భారతదేశం నుంచి వస్తున్న కొత్త పోకడ. అవి త్వరగా భూమిలో కలిసిపోవు. వాడకం ఎక్కువగా లేనప్పుడు వాటిని వినియోగించకపోవడమే మంచిది.

## దీపం నేలమీద పెట్టకూడదా?

కుందులు తయారు చేసేవారు ఆ కుందులకు ఒక ఆధార రూపాన్ని తయారుచేస్తారు. వాటిని నేలమీదే పెట్టి వెలిగించవచ్చు. ఒక ఆకు లేదా పళ్లెంలో దీపారాధన కుందిని పెట్టవచ్చు. మట్టి ప్రమిదల విషయంలో ఒకదానిలో మరో ప్రమిద పెట్టాలి. ఇందులో క్రింద ఉండే ప్రమిద ఆసనం అవుతుంది.



కార్తికమాసంలో ఆలయాల్లోనూ, దీపోత్సవాల్లోనూ దీపవృక్షాలను ఏర్పాటు చేస్తారు. ఎత్తైన వేదికలపై, ఆలయాల చుట్టూ దీపాలు వెలిగిస్తారు. ఆ సందర్భాలలో ఒకే ప్రమిదలో దీపం వెలిగించినా తప్పులేదు.


RNI Regn.No.TELTEL/2015/66688 | Postal Regd.No. HCD-5002/2016-2018
Date of Posting : 28th of every month | Date of Publication : 25th of every month

## కార్తికదీపారాధనకు ఎలాంటి నూనె వాడితే మంచిది?

దీపారాధనకు వాడే నూనె సువర్ణవర్ణంలో ఉంటే మంచిది. నూనె ఎంత పల్చగా ఉంటే అంత మంచిది. సులభంగా పనులు నెరవేరుతాయి. ఆవునెయ్యి ఉత్తమం. నువ్వులనూనె మధ్యమం, ఇప్పనూనె అధమం అని చెప్పారు.

★ ఆవునెయ్యితో వెలిగించిన దీపం ఆయుష్షు, ఆరోగ్యాన్ని పెంచుతుంది. జ్ఞానలాభం, మోక్షప్రాప్తి కలిగిస్తుంది.

★ నూనెల్లో నువ్వులనూనె, కొబ్బరినూనె మంచివి. నువ్వులనూనెతో చేసిన దీపారాధన పర్యావరణానికి, కంటికి మంచిది.

★ కొబ్బరినూనెతో దీపారాధన చేస్తే త్వరలో వివాహం, సంతానప్రాప్తి కలుగుతుంది. కలహాలు తొలగిపోతాయి. కోరుకున్న పనులవుతాయి.

★ మంచినూనెతో దీపం వెలిగిస్తే సంపద, కీర్తి కలుగుతాయి.

★ ఇప్పనూనెతో దీపం ఇహభోగం పొందడానికి, మిగతా నూనెలతో దీపాలు కామ్యార్థాలకు, శత్రునాశనానికి ఉపయోగిస్తారు.

★ పిండితో చేసిన దీపాలు వెలిగిస్తే స్త్రీలకు మాంగల్యభాగ్యం, దేవీ అనుగ్రహం కలుగుతాయి.



★ నాగులజంట బొమ్మ ముందు పిండిదీపం వెలిగిస్తే సర్పదోష నివారణ అవుతుంది.

★ నిమ్మకాయ డిప్పలో దీపాన్ని రాహుగ్రహ దోష నివారణకోసం వెలిగిస్తారు.

★ కార్తికమాసంలో దీపారాధన ఏ చమురుతో చేసినా బ్రహ్మహత్య, సురాపానం, కనకచౌర్యం వంటి మహాపాతకాలు నశిస్తాయి. ఇహపరసౌఖ్యాలు, పుణ్యలోకాలు ప్రాప్తిస్తాయి.

## ప్రమిదలో చమురు మిగిలిపోతే ఏం చేయాలి?

ముందురోజు మిగిలిపోయిన చమురును తీసేయాలి. ఇత్తడి, కంచు కుందులైతే వాటిని తోముకున్న తరువాతే మళ్లీ దీపారాధన చేయాలి. మట్టిప్రమిదల్లో దీపారాధన చేసేట్లయితే క్రిందటిరోజు వెలిగించిన వత్తిని, మిగిలిపోయిన చమురును ఎవరూ తొక్కని చోట పారబోయాలి. ఆ తరువాత మళ్లీ కొత్తగా చమురు, వత్తులు వేసి దీపం వెలిగించాలి.


RNI Regn.No.TELTEL/2015/66688 | Postal Regd.No. HCD-5002/2016-2018
Date of Posting : 28th of every month | Date of Publication : 25th of every month
DEWALI



## సుగంధ తైలాలను దీపారాధనకు వినియోగించవచ్చా?

పనికిరాదు. అభిషేక సమయాల్లో సుగంధతైలాలను వినియోగించే విధానం ఉంది. ప్రత్యేకించి శివుణ్ణి సమస్త తైలాలతో అభిషేకిస్తారు. కానీ దీపారాధన విషయంలో మాత్రం సుగంధతైలాలను ఎవరూ వినియోగించరు. సువాసన కోసం ధూపం వేయడం, పన్నీరు వంటివాటిని చిలకరించడం, గంధం సమర్పించడం వంటి ఉపచారాలు దైవానికి చేస్తాం. దీపారాధనకు మాత్రం సుగంధ తైలాలను వినియోగించరు.

## ఇంట్లో దీపం పెట్టవలసిన ముఖ్యప్రదేశాలేవి?

దేవుని వద్ద మొదటిసారి దీపం వెలిగించాలి. గడపకు రెండువైపులా పెట్టే దీపాన్ని దేహళీదత్త దీపం అంటారు. గడపపైన దీపం పెట్టకూడదు. గడపకు బయట వీధివైపు దీపం ప్రమిదలో పెట్టాలి. తులసికోట వద్ద, ధాన్యాగారం వద్ద, బావివద్ద ఈ అయిదు ప్రదేశాల్లోనూ తప్పనిసరిగా దీపం పెట్టాలి. ముఖ్యంగా కార్తికంలో పితృదేవతలను తలచుకుంటూ దీపం వెలిగించాలి. ఉదయవేళలో అయితే సూర్యునికి నమస్కరించాలి. సాయంత్రవేళలో చంద్రునికి పక్కనే ఆర్ద్రనక్షత్రం సాక్షాత్తూ శివస్వరూపంగా వెలుగుతూ ఉంటుంది. సాయంత్రంపూట దీపారాధన అయినవెంటనే నక్షత్రదర్శనం చేయాలి.

## దీపానికి తప్పనిసరిగా నైవేద్యం పెట్టాలా?

దీపం వెలిగించిన వెంటనే మూడుచోట్ల కుంకుమ పెట్టాలి. పువ్వులు, అక్షతలు సమర్పించాలి. బెల్లం, చక్కెర, పటికబెల్లం, ద్రాక్షపండు వంటివి దీపలక్ష్మికి నైవేద్యం పెట్టవచ్చు. ఇంటిముందు పెట్టే దీపాలకు నైవేద్యం పెట్టనవసరం లేదు. ఆలయాల్లోనూ, దీపోత్సవాల్లోనూ ఈ సంప్రదాయం పాటించనక్కరలేదు.



## కార్తికదీపం ఏ దిక్కులో వెలిగించాలి?

ఎప్పుడైనా దీపం తూర్పు లేదా ఉత్తరదిక్కులను చూసేలా వెలిగిస్తే మంచిదే. కుదరని పక్షంలో దేవునికి కుడివైపున వెలిగించుకోవచ్చు. ఎనిమిది దిక్కుల్లోనూ దీపం వెలిగిస్తే ఏ దోషమూ లేదు.


RNI Regn.No.TELTEL/2015/66688 | Postal Regd.No. HCD-5002/2016-2018
Date of Posting : 28th of every month | Date of Publication : 25th of every month

## కార్తికంలో దీపదానం చేయడం వల్ల కలిగే ఫలితాలేమిటి?

కార్తికంలో దీపదానం ఉత్తమ ఫలితాన్నిస్తుంది. ముఖ్యంగా పాడ్యమి, చతుర్థి, ఏకాదశి, ద్వాదశి, త్రయోదశి, చతుర్దశి, పూర్ణిమ తిథుల్లో దీపదానం చేయాలి.

**ఏకతస్సర్వ దానాని దీపదానంతథైకత్తతః**
**కార్తికే దీపదానస్య కలాంనార్హంతి షోడశీమ్**

ఎన్ని గొప్పదానాలు చేసినా అవేవీ దీపదానానికి సరిసమానం కావు. కార్తిక మాసంలో దీపదానమే అన్నింటికంటే శ్రేష్ఠమైనది. దీనిని పుణ్యక్షేత్రాలలో ఆచరించడం శ్రేష్ఠం. ఇంటివద్దనైనా చేయవచ్చు. దీపదానం చేయడానికి ముందు ఓ వెండి పళ్లెం లేదా రాగి పళ్లెంలో బియ్యంపోసి మూడు వెండి కుందులను ఉంచాలి. దానిలో ఆవు నెయ్యితో దీపాలను వెలిగించాలి.



నువ్వులనూనె, ఆముదంనూనె దీపాలను దానమివ్వకూడదు. మూడు దీపాలలోనూ దూదితో చేసిన వత్తులతోపాటు బంగారం లేదా వెండితో చేసిన పుల్లలను దీపపు వత్తులుగా చేసి ఉంచాలి. ఆ మూడు వెండి ప్రమిదల చుట్టూ ఏడు ఉసిరికాయలను ఉంచాలి. వాటిపైన ఆవు నేతితో తడిపిన నిలువు వత్తులను వెలిగించాలి. రాగి వగైరాలకు బదులుగా దక్షిణ కూడా ఇవ్వవచ్చు. దీపదానం స్వీకరించే వ్యక్తి కాళ్లు కడిగి నుదుట తిలకంతో అలంకరించాలి. సంకల్పం చెప్పి దక్షిణపూర్వకంగా ఆ పళ్లేన్ని దానం ఇవ్వాలి. దీపదానం ముత్తయిదువకు కూడా ఇవ్వొచ్చు. స్వీకరించేవారు దొరకని పక్షంలో ఏదైనా ఆలయంలో స్వామి సన్నిధానంలో లేదా ధ్వజస్తంభం దగ్గర దీపాలను వెలిగించాలి. దీపదానం చేసేటప్పుడు ఎన్ని వత్తులు వెలిగిస్తే ఏ ఫలితం వస్తుందో ధర్మసింధువు అనే గ్రంథం చెప్పింది.

**2 వత్తులు - శాంతి, 3 వత్తులు – ధనవృద్ధి, 4వత్తులు – ఐశ్వర్యం, 5వత్తులు - అఖండ ఐశ్వర్యం, 7 వత్తులు – మోక్షప్రదం ఆపైన ఎన్ని వత్తులైనా శక్తికొద్దీ చేయవచ్చు.**

కార్తికంలో ఎప్పుడైనా దీపదానం చేయవచ్చు. పాడ్యమినుంచి వరుసగా ఫలితాలిలా ఉంటాయి... సౌభాగ్యప్రాప్తి, చక్కటి సంతానం, సంపద, వివాహయోగం, ఉద్యోగం, ఉన్నత పదవి, ఉన్నత పురస్కారం, పాపవిముక్తి, దీర్ఘాయువు, ఇంద్రలోకం, వైకుంఠ సన్నిధి, విష్ణుసాయుజ్యం, జన్మరాహిత్యం, ఈశ్వర సాయుజ్యం. దీపదాన ఫలితాన్ని అందించేందుకు దేవతాగణాలు ఎప్పుడూ సిద్ధపడి ఉంటారని పురాణాలు చెబుతున్నాయి.


RNI Regn.No.TELTEL/2015/66688 | Postal Regd.No. HCD-5002/2016-2018
Date of Posting : 28th of every month | Date of Publication : 25th of every month



## ఆరోగ్యం కోసం దీపారాధన ఎలా చేయాలి?

అనారోగ్యానికి కారణం నక్షత్ర ప్రభావం అని జ్యోతిష శాస్త్రం చెబుతుంది. అనారోగ్యంతో ఉన్న వ్యక్తి పేరు చెబుతూ నక్షత్రశాంతి దీపారాధన చేసినట్లయితే రోగం త్వరగా శాంతిస్తుందని చెబుతారు. దీనికోసం ఆముదం, నువ్వులనూనె, ఆవునెయ్యి సమభాగాలలో ప్రమిదలో పోయాలి. మూడు వేర్వేరు రంగులు కలిగిన నూలుదారాన్ని ఒక వత్తిగా పేనాలి. నవధాన్యాలు పరిచి వాటిపై ప్రమిదను ఉంచి దీపారాధన చేయాలి. అయిదురోజుల పాటు ఈ విధంగా నక్షత్రశాంతి దీపారాధన చేసినట్లయితే అనారోగ్యం, అపమృత్యు భయం తొలగుతాయని చెబుతారు.

## దీపారాధనే ప్రధానంగా ఉన్న వ్రతాలేవి?

శతవర్తి వ్రతం, లక్షవర్తివ్రతం అనే రెండు వ్రతాలను స్త్రీలు ఆచరిస్తారు. ప్రధానమైన మాఘ, కార్తిక, వైశాఖమాసాల్లో ఏదో ఒక మాసంలో మొత్తంమీద వందవత్తులతో ఇష్టదైవం ముందు శతవర్తి వ్రతం. రోజుకు మూడుచొప్పున వత్తులతో దీపారాధన చేసినా నెలకు వందవత్తులు పూర్తిచేయడం తేలికే. చివరిలో దీపదానం చేయాలి. లక్షవర్తివ్రతం కొంత ఖర్చుతో కూడుకున్నది. నియమాలు సైతం కఠినంగా ఉంటాయి. కార్తిక, మాఘ, వైశాఖ మాసాల్లో దీన్ని ఆచరించవచ్చు. ఏకాదశి నాడు ఉపవాసం ఉండాలి. సాయంత్రం నుంచి తెల్లవారుఝాము వరకు నాలుగు గంటలకు ఒకసారి లక్ష్మీనారాయణులను పూజిస్తూ లక్షవత్తులను వెలిగిస్తూ గడపాలి. మరునాడు హోమం, సమారాధన నిర్వహించాలి.



## విద్యుత్ దీపాలను దీపారాధనకు ప్రత్యామ్నాయంగా భావించవచ్చా?

దేవుని గదిని విద్యుత్ దీపాలతో అలంకరించుకోవచ్చు. ఎల్లప్పుడూ అక్కడ దీపం ఉండేలా వెలిగించ వచ్చు. కానీ విద్యుత్ దీపాలు మనం వెలిగించే దీపాలకు సమానం కావు. ఆవునెయ్యి, నువ్వులనూనెతో వెలిగించిన దీపాలవల్ల సానుకూల కిరణ ప్రభావాలు సాధకునిపై పనిచేస్తాయి. నేటికీ ప్రసిద్ధ ఆలయాల్లో మూలమూర్తిపై వెలుగు పడేలా విద్యుత్ దీపాలను అమర్చడం లేదు. కేవలం దీపకాంతుల్లోనే దైవదర్శనం చేయడం ఉత్తమం. ఇంటిలో విద్యుత్ దీపాలను అమర్చుకున్నంత మాత్రాన దీపారాధన మానివేయకూడదు. నిత్యం దీపారాధన చేయవలసిందే.


RNI Regn.No.TELTEL/2015/66688 | Postal Regd.No. HCD-5002/2016-2018
Date of Posting : 28th of every month | Date of Publication : 25th of every month
DEWALI



## కార్తికపౌర్ణమినాటి జ్వాలాతోరణం ప్రాశస్త్యం ఏమిటి?

కార్తిక పౌర్ణమి నాటి సాయంత్రం జ్వాలాతోరణం సిద్ధమవుతుంది. శివాలయాలలో ప్రధాన ఆలయానికి ఎదురుగా రెండు ఎత్తయిన కర్రలు నాటుతారు. ఆ రెండింటినీ కలుపుతూ అడ్డంగా మరో కర్రను కడతారు. అడ్డంగా కట్టిన కర్రకు ఎండుగడ్డిని వేలాడే విధంగా చుడతారు. చంద్రదర్శనం తరువాత ఆ గడ్డిపై నెయ్యిపోసి మంట వెలిగిస్తారు. ఇది తోరణంలా వెలుగుతుంది. ఈ జ్వాలా తోరణం కింద నుంచి పల్లకిలో పార్వతీపరమేశ్వరులను ఉంచుకుని భక్తులు మూడుసార్లు ఆలయం చుట్టూ ప్రదక్షిణ పూర్వకంగా నడిచి వెళతారు. ఒకపక్క జ్వాలాతోరణం వెలుగుతున్నప్పుడే, మూడోప్రదక్షిణ పూర్తికావడానికి కొంచెం ముందునుంచే భక్తుల సంరంభం కూడా మొదలైపోతుంది. జ్వాలాతోరణంలో కాలగా మిగిలిన గడ్డిని పశువుల మేతలో కలుపుకుంటే మంచిదని భావిస్తారు. అందుచేత పోటీలుపడి గడ్డిని లాగడానికి పోటీలు పడతారు. తోరణంలో కాలిన గడ్డినుంచి వచ్చిన భస్మాన్ని నుదుట ధరిస్తే సకల ఐశ్వర్యప్రదం, సర్వరక్షాప్రదమని భావిస్తారు. విభూతి సేకరణకు శక్తికొద్దీ ప్రయత్నిస్తారు. చిన్న ఆలయాల్లో జ్వాలాతోరణం జరిగినా విశేషంగా భక్తులు పాల్గొంటారు. ప్రతివారికీ ప్రాప్తమున్నంత శివప్రసాదం లభ్యమవుతూ ఉంటుంది.

## ఏఏ పొద్దుల్లో దీపారాధన చేయాలి?

మనకు మూడు సంధ్యాకాలాలున్నాయి. ప్రాతఃసంధ్య, మాధ్యాహ్నిక సంధ్య, సాయంసంధ్య అనేవి ప్రధానమైనవి. ఉదయం తొమ్మిది లోపుగా దీపం వెలిగించాలి. మళ్లీ మధ్యాహ్నం పన్నెండులోపుగా వెలిగించాలి. సూర్యాస్తమయం అయిన వెంటనే ఇంటిలో దీపం పెట్టాలి. కుదరని పక్షంలో రాత్రి లోపుగా దీపం వెలిగించాలి. రాత్రంతా దీపం వెలిగించి ఉంచడం మంచిదని పెద్దలు చెబుతారు. దీపోత్సవాలలో సామూహికంగా అందరూ చేస్తున్న సమయంలో సభా సంప్రదాయాలను అనుసరించి దీపారాధన చేయవచ్చు.




RNI Regn.No.TELTEL/2015/66688 | Postal Regd.No. HCD-5002/2016-2018
Date of Posting : 28th of every month | Date of Publication : 25th of every month

## కార్తికంలో ఆలయాల్లో ఆకాశదీపం వెలిగించే ఆంతర్యం ఏమిటి?

**దామోదరాయ నభసి తులాయాందోలయా సహ**
**ప్రదీపంతే ప్రయచ్ఛామి నమోనంతాయ వేదసే**

ఆకాశంలో ఉయ్యాల ఊగే దీపాన్ని దామోదరునికి సమర్పిస్తున్నాను. ఈ దీపకాంతుల వలే నా ఆనంద భావనలు శాశ్వతత్వాన్ని పొందాలి అని పై శ్లోకానికి అర్థం. కీటకాలు, పక్షులు, అభాగినులై పుణ్యలోకాలకు చేరలేని సమస్త జీవజాలానికి ఆకాశదీప దర్శనం సద్గతులు కలిగిస్తుంది. శివాలయాల్లో ధ్వజస్తంభానికి ఆకాశదీపం కడతారు. మూడు సిబ్బెలలో దీపాలు వెలిగించి ధ్వజస్తంభం పైకి చేర్చుతారు.

**ఆకాశదీపం యో దద్యాన్మాస మేకం నిరన్తరమ్**
**మహాతంశ్రియమాప్నోతి రూప సౌభాగ్య సంపదమ్**

సాయంకాలంలో నువ్వుల నూనెతో ఆకాశ దీపారాధన చేస్తే రూప, సౌందర్య, సౌభాగ్య సంపదలు వృద్ధి చెందుతాయి.



## ఇంటివద్ద కూడా ఆకాశదీపం పెట్టుకోవచ్చా?

ఇంటివద్ద కూడా ఆకాశదీపం వెలిగించవచ్చు. చెయ్యెత్తు పొడవున్న మోదుగ, రావి, జువ్వి, మేడి, మామిడి - కర్రలలో ఏదైనా ఒకదానిని ఇంటికి సమీపంలో పాతాలి. ఆ కర్రపైన ఓ చెక్క పలకను మేకులతో బిగించాలి. దానిపై అష్టదళ పద్మరూపంలో ముగ్గువేసి మధ్యలో ఓ పెద్దదీపం ఉంచాలి. సూర్యాస్తమయం కావడానికి 48 నిమిషాలకు ముందు (రెండు ఘడియలు) ఆ దీపం చుట్టూ ఎనిమిది కోణాల్లో కోణానికి ఒకటి చొప్పున ఎనిమిది దీపాలు పెట్టాలి. వెరసి తొమ్మిది దీపాలు వెలిగించాలి. శక్తిలేనివారు మూడు లేదా అయిదు దీపాలు వెలిగించవచ్చు. కొయ్య స్తంభం పాతినచోట మూలభాగంలో అరచేతిలో కొద్దిగా పాలు తీసుకుని దేవతీర్థం ద్వారా (నాలుగు వేళ్ల చివరల నుండి) వదలాలి. ఇలా కార్తిక శుక్ల పాడ్యమి నుంచి అమావాస్య వరకూ ఆకాశదీపం వెలిగించాలి. దీంతో అఖండ ఐశ్వర్యం లభిస్తుంది.





## గ్రహదోషాలు పోగొట్టుకోవడానికి దీపారాధన ఎలా చేయాలి?

రవిగ్రహ దోష నివారణకు కుంకుమ వర్ణంలోని వత్తులను, ఆవునేతిని ఉపయోగించాలి. చంద్ర గ్రహ దోషం పోగొట్టుకోవడానికి తెల్లవత్తులు రెండింటిని నేతిలో ముంచి వెలిగించాలి. కుజ గ్రహదోషానికి ఎరుపురంగులోని మూడు వత్తులను, నువ్వుల నూనెను వాడాలి. బుధగ్రహానికి సంబంధించి తెల్లజిల్లేడు వత్తులను నాలుగింటిని ఎర్రటి ప్రమిదెలో తమలపాకు వేసి వెలిగించాలి. ఇందులో దీపారాధనకు గాను కొబ్బరి నూనెను వాడాల్సి ఉంటుంది. ఇక గురుగ్రహానికి అయిదు తామర వత్తులను ఆవునేతిని ఉపయోగించాలి. శుక్రగ్రహానికి ఆరు తామర వత్తులు వినియోగించాలి. శనిగ్రహానికి ఏడు నల్లని వత్తులను ఇనుప ప్రమిదెలో నువ్వులనూనెతో వెలిగించాలి. రాహుదోషానికి నలుపు వర్ణం కలిగిన ఎనిమిది వత్తులను నిమ్మకాయ డొప్పలో వెలిగించాలి. దీపారాధనలో అష్టమూలికా తైలాన్ని వినియోగించాలి. కేతుగ్రహానికి తెల్లజిల్లేడు వత్తులు తొమ్మిదింటిని కొబ్బరి నూనెతో వెలిగించాలి. రాశులను బట్టి దీపారాధన చేసే పద్ధతులను జ్యోతిషవేత్తలు తెలియచేస్తున్నారు. ఇక్కడ జన్మతేదీలను అనుసరించి రాశులు – గోచారదోష పరిహారం కోసం దీపారాధనలో ఉపయోగించవలసిన వత్తుల వివరాలు ఇస్తున్నాం.

| రాశి | జన్మతేదీ | వెలిగించాల్సిన వత్తులు |
|---|---|---|
| 1. మేషం | మార్చి 21 - ఏప్రిల్ 20మధ్య | 5 |
| 2. వృషభం | ఏప్రిల్ 21 - మే 20 మధ్య | 7 |
| 3. మిథునం | మే 21 - జూన్ 20 మధ్య | 6 |
| 4. కర్కాటకం | జూన్ 21 - జూలై 20 మధ్య | 5 |
| 5. సింహం | జూలై 21 - ఆగస్టు 20 మధ్య | 3 |
| 6. కన్య | ఆగస్టు 21 - సెప్టెంబర్ 20 మధ్య | 6 |
| 7. తుల | సెప్టెంబర్ 21 - అక్టోబర్ 20 మధ్య | 7 |
| 8. వృశ్చికం | అక్టోబర్ 21 - నవంబర్ 20 మధ్య | 2 |
| 9. ధనుస్సు | నవంబర్ 21 - డిసెంబర్ 20 మధ్య | 5 |
| 10. మకరం | డిసెంబర్ 21 - జనవరి 20 మధ్య | 6 |
| 11. కుంభం | జనవరి 21 - ఫిబ్రవరి 20 మధ్య | 6 |
| 12. మీనం | ఫిబ్రవరి 21 - మార్చి 20 మధ్య | 2 |


RNI Regn.No.TELTEL/2015/66688 | Postal Regd.No. HCD-5002/2016-2018
Date of Posting : 28th of every month | Date of Publication : 25th of every month

DEWALI

## దీపాలతో హారతి ఇవ్వవచ్చా?



కర్పూర హారతి కాకుండా దీపహారతి ఇచ్చే సంప్రదాయం కూడా మనకు ఉంది. ఆవునేతిలో తడిపిన వత్తిని వెలిగించి హారతిస్తారు. ఇందుకోసం రెండు, మూడు, ఐదు, ఏడు ఇలా బేసి సంఖ్యలలో దీపాలు వెలిగిస్తారు. అత్యధికంగా నక్షత్ర హారతి అంటే ఇరవై ఏడు ఒత్తులతో హారతినిస్తారు. అయిదు కంటే ఎక్కువ దీపహారతులను సాధారణంగా ఆలయాల్లోనూ, నదీహారతుల్లోనూ మాత్రమే ఇస్తారు. హారతి పళ్లేలను రూపొందించిన విధానాన్ని బట్టి ఆయా పేర్లతో పిలుస్తారు. నాగదీపం, రథదీపం, పురుషదీపం, మేరు దీపం, పంచబ్రహ్మదీపం, గజ దీపం, వృషభ దీపం, కుంభ హారతి, నేత్ర హారతి, బిల్వహారతి, రుద్ర, చక్ర, నారాయణ నవగ్రహ హారతుల వంటివి ఎన్నో ఉన్నాయి. భగవంతుని విగ్రహం నేత్రాల నుంచి పాదాల వరకు మొదటిసారి, ముఖం నుంచి మోకాళ్లవరకు రెండోసారి, ముఖం నుంచి నడుం వరకు మూడోసారి తిప్పుతూ చూపిస్తారు. హారతుల్లో రకరకాలున్నాయి. వత్తుల సంఖ్యను బట్టి హారతులకు పేర్లున్నాయి.



**నేత్రహారతి - 2వత్తులు**

**బిల్వ హారతి - 3**

**కుంభహారతి - 3**

**నంది హారతి - 3**

**సింహహారతి - 3**

**పంచహారతి - 5**

**నాగహారతి - 5**

**రుద్రహారతి - 11**

**నారాయణ హారతి - 16**

**చంద్రహారతి - 16**

**నక్షత్ర హారతి - 27**

**వృక్ష హారతి - 32**

**రథహారతి - 632**

ఉత్సవాలలో, ఆలయాలలో ఒత్తులతో దీపహారతి ఇచ్చినప్పటికీ చిట్టచివరిగా అఖండ కర్పూర హారతి కూడా తప్పనిసరిగా ఇస్తారు.


RNI Regn.No.TELTEL/2015/66688 | Postal Regd.No. HCD-5002/2016-2018
Date of Posting : 28th of every month | Date of Publication : 25th of every month

## కార్తికమాసంలో బిల్వార్చన ప్రాధాన్యం ఏమిటి?

కార్తికమాసంలో బిల్వదళాలతో శివుణ్ణి, తులసీదళాలతో విష్ణువును సేవించాలి. అసలు శివుణ్ణి చూసినవెంటనే ఒక బిల్వదళం సమర్పించాలి. ముందుగా బిల్వదళం సమర్పించకుండా శివునికి అభిషేకం చేయకూడదు. కేవలం జలంతోనే అభిషేకించే సందర్భంలో కూడా లింగంపై బిల్వదళం వేయడం తప్పనిసరిగా భక్తులు భావిస్తారు. బిల్వవృక్షాన్నే మారేడు అని పిలుస్తారు. మూడేసి ఆకులుగా శివుని త్రిశూలాన్ని, త్రినేత్రాలను గుర్తుతెచ్చేలా ఉంటుంది బిల్వదళం. దీనిని త్రిమూర్తులకు ప్రతీకగా కూడా చెబుతుంటారు.

వివిధ రకాల పూలతో అభిషేకించడం కన్నా ... ఒక్క బిల్వపత్రాన్ని సమర్పించడం వలన శివుడు ఎక్కువ సంతోషపడిపోతాడని చెబుతారు. అందుకే శివుడి అనుగ్రహాన్ని కోరే భక్తులు అత్యధిక సంఖ్యలో బిల్వదళాలతో పూజిస్తూ వుంటారు. కార్తికమాసంలో ఎక్కువగా లక్షబిల్వార్చనలు జరుగుతుంటాయి. బిల్వదళానికి ఉన్న ప్రత్యేకత ఏమిటంటే దానిని ఎన్నిసార్లైనా సమర్పించవచ్చు. ఒకరోజు సమర్పించిన బిల్వదళాన్నే మరునాడు కూడా శివునికి సమర్పించవచ్చు. క్రిందపడినా బిల్వదళానికి పవిత్రత చెడిపోదు. శివలింగానికి చుట్టుపక్కల మరొకరు వేసిన దళం చేతిలోకి తీసుకుని మనం మళ్లీ శివలింగంపై ఉంచవచ్చు. ఎన్నిసార్లు శివుణ్ణి చేరితే అన్నిసార్లూ ఫలితాన్నిచ్చేది, ఆయన మళ్లీమళ్లీ కోరుకునేది బిల్వదళమే.

## శివుణ్ణి అభిషేకించేందుకు ఉత్తమ ద్రవ్యాలేవి?



గంగాజలం అన్నింటికంటే శ్రేష్ఠమైనది. ఏ నీటినైనా గంగాసమానంగా భావిస్తూ గంగాధరుణ్ణి అభిషేకించవచ్చు. విషాన్ని కంఠంలో దాచుకున్న శివుని శరీరంలో తాపం తగ్గించేందుకు శివునికి నీటితో అభిషేకం చేయాలంటారు. పంచామృతాలు ఆ తరువాత వరుసలోనివి. కాగా చెరకురసం, మామిడి రసం వంటి ఉత్తమజాతి పళ్లరసాలతో మహాదేవునికి అభిషేకం చేయవచ్చు. పూలు కలిపిన నీళ్లు, భస్మం చందనం వంటి ద్రవ్యాలు కలిపిన జలాలతో కూడా శివుణ్ణి అభిషేకిస్తారు. సుగంధద్రవ్యాలు, నువ్వులనూనె వంటివాటితోనూ అభిషేకాలు చేస్తారు. అన్నాభిషేకమూ నిర్వహిస్తారు. సృష్టిలో సమస్తాన్నీ సాంబశివుని ఆరాధనకు వినియోగించవచ్చు. ఒక్కో ద్రవ్యానికి ఒక్కో ఫలితాన్ని పెద్దలు చెబుతారు. అన్నింటికంటే ముఖ్యమైనది, ఆయన ఎక్కువగా ఇష్టపడేది మాత్రం జలాభిషేకమే.


RNI Regn.No.TELTEL/2015/66688 | Postal Regd.No. HCD-5002/2016-2018
Date of Posting : 28th of every month | Date of Publication : 25th of every month
DEWALI

## కార్తికంలో ఉపవాసం ఎందుకు చేయాలి?



కార్తికం సాధనామాసం కనుక ఉపవాస వ్రతాన్ని ప్రధానంగా చేస్తారు. మిగిలిన ఉపవాసాల వలె కాకుండా పగలంతా ఉపవసించి సాయంత్రం శివ కేశవులను పూజించి నక్షత్ర దర్శనం చేసుకుంటారు. భగవంతునికి నివేదించిన ఆహారం స్వీకరిస్తారు. ఈ విధంగా చేయడాన్ని నక్తం అంటారు. నెలంతా కుదరక పోయినా సోమవారాలు ఈ వ్రతం ఆచరించడం శ్రేష్టం.

**సోమవారేతు కార్తిక్యాం శివలింగాభిషేచనం**
**పూజాం చైవతు నక్తం చ యః కుర్యాత్ స శివప్రియం**

శివభక్తులు కార్తిక సోమవారం లింగార్చన, పూజ, ఉపవాసం చేస్తే శివానుగ్రహాన్ని పొందుతారు. కార్తికంలో వచ్చే సోమవారాలన్నీ నియమంగా పాటిస్తే సోమవార వ్రతమవుతుంది. అది శివునికి ప్రీతిపాత్రం. దీన్ని పాటించినవారు కైలాసానికి వెళతారు. కార్తిక సోమవారం నాడు చేసిన స్నాన, దాన, జపాదులు వెయ్యి అశ్వమేధ యాగాలు చేసిన ఫలితాన్నిస్తాయి. కార్తిక సోమవారం ఉపవాసం చేసినవారు స్త్రీలు, పురుషులు అందరూ నక్షత్ర దర్శనం చేసి భోజనం చేస్తే శివలోకానికి వెళతారు. కార్తిక సోమవారంనాడు శక్తిమేరకు శివాభిషేకం చేయాలి. పగలంతా ఉపవాసం చేయాలి. ప్రదోషకాలంలో అంటే సాయంత్రవేళలో నక్షత్ర దర్శనం అయ్యేంతవరకు శివారాధన కొనసాగించాలి. కార్తికమాసంలో సోమవారంనాడు నక్తవ్రతం అంటే, ఒంటిపొద్దు భోజనం చేయడం ఆచారం. పగలంతా ఉపవాసం చేసి, నక్షత్ర దర్శనం అయ్యాక విరమిస్తారు. కార్తిక సోమవారం ఏకాదశి వచ్చినట్లైతే ఆ రోజంతా ఉపవాసం ఉండాలి. రాత్రంతా జాగరణ చేయాలి. ఉదయమే ద్వాదశి ఘడియల్లో పూజ చేయాలి. శక్తి కొద్దీ అన్న సమారాధన చేయాలి. కార్తికం చలికాలం కావడం చేత మానవులకు ఆహారం అరుగుదల మందంగా ఉంటుంది. కాబట్టి ఈ కాలంలో ఆహారం తినకుండా ఉపవాసం ఉండి రాత్రి భుజించాలంటారు. ఈ నియమాలన్నీ పాటిస్తూ శివునికి బిల్వపత్రాలతో పూజచేస్తే భక్తుల కోరికలు నెరవేరతాయి. ఈ మాసంలో ప్రతి సంధ్యాకాలంలో దీపారాధన తప్పనిసరి నియమం.

## కార్తికంలో ఒంటిపొద్దు భోజనం ఎందుకు చేయాలి?

పగలంతా భోజనం చేయకుండా సాయంత్రం వేళ శివాభిషేకం చేసి నక్షత్ర దర్శనం అయ్యాక తులసి తీర్థాన్ని మాత్రమే సేవించడం ఉపవాసం. ఉదయం పూట యథాప్రకారం స్నాన, దాన, జపాలను చేసి మధ్యాహ్న భోజనం చేసి రాత్రికి తీర్థాన్ని మాత్రం స్వీకరించడం ఏకభుక్తం అవుతుంది. పగలంతా ఉపవాసంతో గడిపి నక్షత్ర దర్శనం చేసిన తర్వాత భోజనం చేయడాన్ని నక్తం అంటారు. తమకు తాము భోజనం కోసం ప్రయత్నించకుండా ఎవరైనా పిలిచి భోజనం పెడితే తినవచ్చు... దీన్నే అయాచితం అంటారు.. ఇవేవీ చేయలేని వారు కార్తిక సోమవారం నువ్వులు దానం చేసినా సరిపోతుంది.. దీన్నే తిలాదానం అంటారు.. ఈ ఆరు విధానాల్లో కనీసం ఒకటైనా కార్తిక సోమవారం నాడు ఆచరించడం శ్రేయస్కరమని శివపురాణం చెబుతోంది.

## కార్తికంలో నక్షత్రదర్శనం ప్రాధాన్యం ఏమిటి?

కార్తికమాసంలో నక్షత్ర కూటమిని విరాట్ పురుషునిగా భావించి ఆరాధించాలి. ఈ నక్షత్ర పురుషునికి కృత్తిక కటిస్థానం. మూల నక్షత్రం పాదాలు. రోహిణి తొడలు. అశ్విని మోకాళ్లు, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ పిరుదులు. ఉత్తర ఫల్గుణీ, పూర్వ ఫల్గుణి నక్షత్రాలు మర్మస్థానాలు. ఉత్తరాబాధ్ర, పూర్వాభాద్ర నక్షత్రాలు భుజాలు. రేవతి కుక్షి. అనురాధ వక్షస్థలం. విశాఖ ముంజేతులు. హస్త చేతులు. పునర్వసు వేళ్లు. జ్యేష్ఠ కంఠం. పుష్యమి ముఖం. భరణి శిరస్సుగా మారిపోతాయి. కార్తిక మాసంలో నక్షత్ర పురుష పూజ అంటే విశాల విశ్వారాధనగా భావించాలి.

**నక్తవ్రతం చేయాల్సిన రోజులు : కార్తిక సోమవారాలు**
**పూర్తి ఉపవాసం చేయాల్సిన రోజులు : కార్తిక ఏకాదశి తిథులు, పౌర్ణమి.**





RNI Regn.No.TELTEL/2015/66688 | Postal Regd.No. HCD-5002/2016-2018
Date of Posting : 28th of every month | Date of Publication : 25th of every month
DEWALI

## కార్తికంలో వన భోజనం ఎందుకు చేస్తారు?



కార్తిక మాసంలో ఉసిరిక చెట్టుకింద పూజచేసి వనభోజనాలు చేయాలి. ఈరోజు శివునికి అన్నపూర్ణాదేవి చేసిన విందు, వ్యాసుని విందు, దుర్వాస – అంబరీషుల విందు, భరద్వాజ – రామవిందు, శబరి రామునికి చేసిన విందు, కృష్ణుడు కుచేలునికి ఇచ్చిన ఆతిథ్యం, కృష్ణునికి విదురుడిచ్చిన ఆతిథ్యం గుర్తుచేసుకోవాలి.

**యః కార్తికే సితే**
**వనభోజన మాచరేత్**
**సయాతి వైష్ణవ ధామం**
**సర్వ పాపైః ప్రముచ్యతే**

కార్తికపురాణంలోని పంచమాధ్యాయం వనభోజనాల విశిష్టతను చెప్పింది. కార్తిక మాసంలో వనభోజనం చేసినవారు సకల పాపాల నుంచి విముక్తులై దైవ ధామాన్ని పొందుతారు. సూతమహర్షి నైమిశారణ్యంలో కార్తికపౌర్ణమినాడు మునులందరితో కలిసి ఉసిరిచెట్టు కింద భుజించాడు. ఔషధ గుణాలు నిండిన ఉసిరిచెట్టును సరస్వతీ అంశగా చెబుతారు. కార్తిక మాసంలో ఈ ఉసిరి చెట్టును కార్తిక దామోదరునితో పాటు దేవతలందరూ ఆశ్రయించి ఉంటారు

కార్తిక సంప్రదాయాలు అన్నింటిలోనూ మానసిక ఉల్లాసాన్ని, ప్రశాంతతను అందించే సంప్రదాయం వనభోజనం. ఈ కార్తిక మాసంలో ఏదో ఒకరోజు తప్పనిసరిగా వనభోజనం చేయాలి. వివిధ జాతుల చెట్లు ఉన్న తోటలో ముఖ్యంగా ఉసిరి చెట్టు ఉన్నచోట ఆటపాటలతో గడిపి భోజనం చేయడం వనభోజన ఆచారం. దీనికి సంబంధించి కొన్ని నియమాలున్నాయి. ఉసిరిచెట్టు నీడ ఆరోగ్యానికి మంచిది. అందుకే ఉసిరి చెట్టు కింద కూర్చుని పనస ఆకులో భోజనం చేయాలంటుంది శాస్త్రం. అంతకంటే ముందుగా ఉసిరి చెట్టు కింద సాలగ్రామాన్ని ఉంచి పూజించాలి. ఇలా చేయడం వల్ల అశ్వమేథ యాగం చేసిన


RNI Regn.No.TELTEL/2015/66688 | Postal Regd.No. HCD-5002/2016-2018
Date of Posting : 28th of every month | Date of Publication : 25th of every month

ఫలం లభిస్తుందంటారు. సాలగ్రామ పూజ సాధ్యం కానప్పుడు లక్ష్మీనారాయణుల ప్రతిమను గానీ ఫోటో గానీ ఉంచి పూజించాలి. పసుపు, గంధం, కుంకుమలతో ఉసిరి చెట్టును అలంకరించి 21 నామాలను చదువుతూ పుష్పాలతో పూజించాలి. ఉసిరిచెట్టుకు తొమ్మిది ప్రదక్షిణలు చేయాలి.

**ధాత్రేదేవీ నమస్తుభ్యం సర్వపాప క్షయంకరీ**
**పుత్రాన్ దేహి మహాప్రాజ్ఞే యశోదేహి బలంచమే**
**ప్రజ్ఞా మేధాంచ సౌభాగ్యం విష్ణుభక్తించ శాశ్వతీం**
**నిరోగం కురుమాం నిత్యం నిష్పాపం కురుసర్వదా**

పిండివంటలతో షడ్రసోపేతమైన విందును సమకూర్చి ఉసిరిచెట్టుకు నివేదన చేయాలి. ఆ ప్రసాదాన్ని సహపంక్తిలో అందరితో పంచుకుని తినాలి. విశిష్ట పర్వాలలో అన్నదానం చేయడం వల్ల విశేషమైన ఫలం లభిస్తుంది. అన్నసమారాధనలో పాల్గొన్నా, మనవంతు సాయం అందించినా మంచిదే.

**కార్తికంలో తినవలసినవి : ఆవుపాలతో చేసిన పాయసం, కంద- బచ్చలి**



**తినకూడనివి : ఇంగువ, ఉల్లి, వెల్లుల్లి, ముల్లంగి, దుంప, గుమ్మడికాయ, శనగ, పెసర, అలసందలు, నువ్వులు. ఆదివారంనాడు ఉసిరి పచ్చడి తినకూడదు.**

**దానమివ్వాల్సిన ఆహారపదార్థాలు : ఉసిరి, పళ్లు, బెల్లం, అట్లు, గోధుమలు, నెయ్యి**










RNI Regn.No.TELTEL/2015/66688 | Postal Regd.No. HCD-5002/2016-2018
Date of Posting : 28th of every month | Date of Publication : 25th of every month



# నాగుల చవితినాడు పాముల పుట్టవద్ద దీపాలు వెలిగించాలా?

కార్తిక శుద్ధ చవితినాడు (నవంబర్ 11) నాగుల చవితి పండుగ వస్తుంది. ఈ రోజు స్త్రీలు పుట్టలో పాలు పోసి చలిమిడి, వడపప్పు, నువ్వులతో చేసిన తీపి ఉండలు (చిమ్మిలి) నాగదేవతలకు నైవేద్యంగా సమర్పిస్తారు. ఈనాడు సూర్యోదయానికి ముందు ఆకాశంలో తూర్పుదిక్కున శేషుని ఆకారంలో నక్షత్రరూపం కనిపిస్తుంది. దీపావళినుండి అయిదో రోజున నాగపంచమి పర్వాన్ని జరుపుకుంటారు. నాగేంద్రస్వామికి పుట్టలో పాలు పోయడం మన అలవాటు. పిల్లలతో ఈ విధంగా పాలు పోయించడం వల్ల వారికి ఎలాంటి అనారోగ్యాలు, అరిష్టాలు లేకుండా ఎదుగుతారని విశ్వాసం. పుట్టల కొనలలోనుంచి ఆవుపాలు, వడపప్పు, చలిమిడి, అరటిపండ్లు జారవిడిచి పుట్టలో కొలువైన నాగమయ్యకు పిల్లా పెద్దా భక్తిశ్రద్ధలతో నైవేద్యం పెడతారు. ముందుగా పుట్ట వద్ద శుభ్రం చేసి ముగ్గులు పెట్టి పసుపు కుంకుమలు, పూలు చల్లి పూజ చేస్తారు. ఆపై నాగేంద్రునికి నైవేద్యం పెడతారు.

నైవేద్యం పెట్టడానికి ముందుగా పుట్టకు పూజచేస్తారు. పూజావిధానంలో దీపం వెలిగించడం, ధూపం చూపించడం తప్పనిసరి కాబట్టి దీపారాధన కూడా చేస్తారు. చేయకపోయినా తప్పుకాదు. పాముల పుట్టవద్ద టపాకాయలు వెలిగించడం వంటివి మాత్రం చేయకూడదు.

వర్షాకాలం పూర్తయి శీతాకాలం ప్రవేశిస్తుంటే పాములు వరుసగా పుట్టలు వదిలి బయటకు రావడం ప్రారంభిస్తాయి. అలా వచ్చే పాములను అదుపులో ఉంచేందుకు పుట్టల్లో తేమ ఉంచేందుకు మనవారు నాగులచవితి పండుగను ఏర్పాటు చేశారు.

ఆరోజున పాలు, చిమ్మిలి వంటివి పోయడం వల్ల పాములపుట్టలు తడిగా మారతాయి. దానివల్ల పాములు త్వరగా బయటకు రావు. స్త్రీలకు, పిల్లలకు పాముల పట్ల ఉన్న భయం తొలగేందుకు కూడా నాగులచవితి పర్వదినం ఉపయోగపడుతుంది. భయాన్ని విడిచిపెట్టిన స్త్రీల శరీరంలో చక్కని మార్పులు కలుగుతున్నట్లు శాస్త్రవేత్తలు గుర్తించారు. నాగేంద్రుణ్ణి సుబ్రహ్మణ్యస్వామిగా, శ్రీమహావిష్ణువు పవిత్రశయ్యగా, శివుని మెడలోని ఆభరణంగా భావించి అర్చిస్తే శుభాలు కలుగుతాయి. మొత్తంమీద నాగులచవితి పర్వదినంలో పాలు, ఇతర చల్లటి పదార్థాలను పుట్టలో జారవిడవడమే ప్రధానం కానీ దీపారాధన మాత్రం కాదు.


RNI Regn.No.TELTEL/2015/66688 | Postal Regd.No. HCD-5002/2016-2018
Date of Posting : 28th of every month | Date of Publication : 25th of every month



## కార్తికదీపారాధన మహత్యాన్ని తెలిపే పురాణ కథలేవి?

కార్తికపురాణం కార్తిక మాస ప్రాధాన్యాన్ని తెలియచేస్తోంది. ఆ పురాణం ప్రధానంగా దీపమహత్యాన్ని రెండు కథల ద్వారా తెలియచేస్తోంది. మొదటిది మూషికం మోక్షం పొందిన కథ కాగా, రెండోది మోడు ముక్తి పొందిన కథ.

మొదటికథలో... కర్మనిష్ఠుడనే యోగి కార్తికమాసంలో స్నానం ఆచరించడానికి సరస్వతీ నదీతీరానికి వస్తాడు. ఆ నదీతీరంలో ఆయనకు ఒక పాడుపడ్డ విష్ణు ఆలయం కనిపిస్తుంది. ఆలయం శిధిలావస్థలో ఉండడంతో బాధపడిన కర్మనిష్ఠుడు ఎంతో భక్తిశ్రద్ధలతో ఆలయాన్ని తుడిచి, కడిగి శుభ్రం చేశాడు.

ఆ తరువాత శక్తికొద్దీ ప్రమిదలు, వత్తులు, నూనె సంపాదించి ఆలయంలో పన్నెండు దీపాలు వెలిగించాడు. విష్ణుమూర్తిని ఆరాధిస్తూ అక్కడే ఉన్నాడు. కార్తిక శుద్ధద్వాదశినాడు ఎప్పటిలాగే కర్మనిష్ఠుడు దీపాలు వెలిగించి తపస్సు చేసుకుంటుండగా, అక్కడికో ఎలుక వచ్చింది. నూనెతో తడిసిన వత్తులను నాకేందుకు ప్రయత్నం చేసింది. అనుకోకుండా పక్కనే ఉన్న దీపం వెలిగింది. ఆ తరువాత కొంతకాలానికి ఆ ఎలుక మరణించింది. కార్తిక దీపారాధన పుణ్యబలం వల్ల దానికి ఉత్తమమైన పునర్జన్మ కలిగింది. కార్తికంలో స్వయంగా దీపారాధన చేయకపోయినా, ఇతరులు వెలిగించిన దీపాలు కాపాడినా గొప్ప పుణ్యం దక్కుతుందని కథ పరమార్థం.

రెండో కథలో మతంగాశ్రమం సమీపంలో కొంతమంది రుషులు కలిసి ఒక స్తంభదీపాన్ని ఏర్పాటు చేస్తారు. ఒక చెట్టుమోడు మీద ధాన్యం, నువ్వులు పోసి దానిపై ఒక పాత్రలో దీపారాధన చేస్తారు. కొంతసేపటికి దీపం వెలిగించి ఉంచిన మోడు ఫెళఫెళ విరిగిపడడం చూసి వారు ఆశ్చర్య చకితులయ్యారు. ఆ మోడులోంచి ఒక దివ్యపురుషుడు వచ్చి, మునులకు నమస్కరించాడు. గతజన్మ పాపఫలంగా తాను మోడుగా పుట్టానని, ఇన్నాళ్లకు కార్తిక దీపారాధన వల్ల తనకు ఉత్తమ జన్మ వచ్చిందని తెలియచేశాడు.

కార్తికంలో మనకోసం ఇతరులు, ఇతరుల కోసం మనం కూడా దీపాలు వెలిగించవచ్చు. ప్రాణులందరి క్షేమం కోసం దీపారాధన చేసే పవిత్ర సందర్భం కార్తికమాసం.


RNI Regn.No.TELTEL/2015/66688 | Postal Regd.No. HCD-5002/2016-2018
Date of Posting : 28th of every month | Date of Publication : 25th of every month

## సోమవారవ్రతం చేసే విధానం ఏమిటి?

కార్తిక మాసంలో సోమవారం అని వారంపేరు తలుచుకున్నా వెయ్యిసార్లు శివుణ్ణి తలచినట్లేనని అంటారు. దీన్నిబట్టి కార్తిక సోమవారం శివుడికి అత్యంత ప్రీతికరమైన రోజని అర్ధమవుతుంది. ఆ రోజు చేసిన పూజలకు, అభిషేకాలకు, దానాలకు ఈశ్వరుడు అధికంగా సంతుష్టుడవుతాడు. భక్తుల సర్వ అభీష్టాలను తీరుస్తాడు. కార్తిక సోమవారం నాడు చేసే శివనామస్మరణ సద్యోముక్తిని కలిగిస్తుంది.

**వ్రతకథ :** సోమవారంనాడు శివుడికి శక్తికొద్దీ పూజ చేస్తే జన్మజన్మల పాపాలు నశిస్తాయని స్వయంగా శివుడే పార్వతికి చెప్పాడు. ఒకసారి ఆకాశ మార్గాన పార్వతీపరమేశ్వరులు విహరిస్తుండగా పార్వతీదేవికి పరమేశ్వరుణ్ణి ఈ వ్రతాన్ని గురించి అడిగింది. "నాథా! వర్ణభేదాలు లేకుండా సకల మానవకోటి ఆచరించగలిగే వ్రతం ఏదైనా ఉందా? శాస్త్ర సమ్మతమైనది, ఆచంద్రతారార్కం మానవులకు శుభఫలాలను అందించే వ్రతాన్ని చెప్ప"మని పార్వతి కోరింది. దానికి ఈశ్వరుని సమాధానమే సోమవార వ్రతం. సూర్యోదయం నుంచి ప్రదోషకాలం వరకూ ఉపవాసం చేసి అభిషేక అర్చనలతో సోమవారం తనను పూజించినవారికి సమస్త శుభఫలాలు సమకూరుతాయని శివుడు బోధించాడు.

ఈ వ్రత మాహాత్మ్యాన్ని గురించి వశిష్ఠ మహర్షి జనకమహారాజుకు చెప్పాడు. కార్తికపురాణంలోని సోమవార వ్రత కథ ప్రముఖమైనది. మిత్రశర్మ, స్వాతంత్ర్య నిష్ఠురి అనే దంపతుల కథ ఇది. నిష్ఠురి తన భర్త మిత్రశర్మను నిద్రలో ఉండగా చంపుతుంది. ఆ పాపానికి గాను నరకంలో శిక్ష అనుభవిస్తుంది. తరువాత కుక్కగా పుడుతుంది. ఒకరోజు తినడానికి ఏమీ దొరక్క ఆ కుక్క ఆకలితో అలమటిస్తూ తిరగసాగింది. ఒకానొక శ్రోత్రియ బ్రాహ్మణుడు కార్తిక సోమవార వ్రతాన్ని ఆచరించి బలి అన్నాన్ని బయటపెట్టగా దాన్ని ఆ కుక్క తినేసింది. ఆత్మజ్ఞాన సంపన్నుడైన బ్రాహ్మణుడు సోమవార వ్రత ఫలాన్ని ఆ కుక్కకు ధారబోయగా దానికి ముక్తి లభించింది. శివసాన్నిధ్యానికి వెళ్లింది. జన్మజన్మల పాపాలన్నింటినీ తొలగించగలిగే శక్తి కార్తిక సోమవారం వ్రతానికి ఉందని ఈ కథ తెలియచేస్తుంది. ఇంతకూ సోమవారవ్రతం అంటే కార్తిక సోమవారం నాడు పగటి ఉపవాసంతో నక్షత్రదర్శనం వరకు శివధ్యానం చేయడం మాత్రమే.




RNI Regn No. TELTEL/2015/66688 | Postal Regd No. HCD-5002/2016-2018
Date of Posting : 28th of every month | Date of Publication : 25th of every month


## శివునికి ప్రీతిపాత్రమైన నైవేద్యాలేవి?



వండిన పదార్థాలు, ప్రకృతిలో సహజసిద్ధంగా లభించేవి రెండింటినీ భగవంతునికి నివేదనగా సమర్పిస్తాం. ఏ దైవానికైనా కొబ్బరి, అరటిపండు సర్వశ్రేష్ఠ నివేదనలు. శివుని విషయానికి వస్తే ద్రాక్ష పండు, ఎండు ఖర్జూరం వంటివి నివేదించాలి. శివునికి పంచదార నివేదిస్తే ఐశ్వర్యం లభిస్తుంది. శివుడికి సోమవారం నాడు దధ్యోదనం నివేదించాలి. మహాశివరాత్రి నాడు పాయసం నివేదిస్తే కోరికలన్నీ తీరుతాయి. శివుడికి అన్నీ ప్రీతిపాత్రమైనవే. కానీ ముడినువ్వులు శనికి మాత్రమే సమర్పించాలి. శివునికి నువ్వులు, బెల్లం కలిపినూరిన చిమ్మిలి నైవేద్యంగా పెట్టవచ్చు.



## శివుడికి ఇష్టమైన పుష్పాలేవి?

శివపురాణంలోని విశ్వేశ్వర సంహితలో ఈ ప్రశ్నకు సమాధానం ఉంది. చంపకం (సంపంగి), కేతకం (మొగలి పువ్వు) తప్ప భక్తితో ఏది సమర్పించినా తనకు ఆనందమేనన్నాడు శివుడు. పరిమళ పుష్పాలతో శివుణ్ణి పూజిస్తే ఋణాలు తీరతాయి. తెల్లతామర పూలతో పూజిస్తే జ్ఞానం లభిస్తుంది. ఐశ్వర్యం కావాలంటే బిల్వపత్రాలతో పూజించాలి. మందార పుష్పాలతో పూజిస్తే దాంపత్య సౌఖ్యం లభిస్తుంది. ఏ రంగు గన్నేరు పూలతో పూజించినా కుటుంబవృద్ధి, ధనధాన్యవృద్ధి కలుగుతాయి. పుష్పపూజ వల్ల మనిషికి వికాసం కలుగుతుంది. శివునికి గరిక కూడా ఇష్టమే. శంకరులు చెప్పినట్లుగా ఎక్కడికెక్కడి అరుదైన పుష్పాలను తెచ్చి శివుణ్ణి పూజించాలని భక్తుడు తాపత్రయ పడతారు. అందరికంటే హృదయ పుష్పాన్ని సమర్పించేవారినే ఆయన ఎక్కువ ఇష్టపడతాడు. ముందుగా మనస్సనే కుసుమాన్ని మహాదేవుడికి సమర్పించాలి.

## శివాలయంలో సోమసూత్రం ఎందుకు దాటకూడదు?

శివలింగం నుంచి అభిషేక జలం కిందకు ప్రవహించే ఏర్పాటుకు సోమసూత్రం అని పేరు. ఈ సోమసూత్రాన్ని దాటే అవసరం గర్భాలయంలో అభిషేకం చేసేవారికే కాని, ఇతర భక్తులకు రానేరాదు. సోమసూత్రానికి చివర చండికేశ్వరుడు ఉంటాడు. పానవట్టానికి కిందుగా కానీ, గర్భాలయానికి బయట


RNI Regn.No.TELTEL/2015/66688 | Postal Regd.No. HCD-5002/2016-2018
Date of Posting : 28th of every month | Date of Publication : 25th of every month

కానీ చండీశ్వరుడు మనకు దర్శనమిస్తాడు. సోమసూత్రం పరిధి అంతవరకే. అందుచేత ప్రదక్షిణ చేసేటప్పుడు సోమసూత్రం దాటకూడదు. చండీప్రదక్షిణలు చేసేవారు అక్కడివరకు వచ్చి చప్పట్లు కొట్టి చండీశ్వరుని ఆరాధిస్తారు. అక్కడినుంచి ధ్వజస్తంభం వద్దకు వెనక్కు వెళ్లి తిరిగి ప్రదక్షిణ కొనసాగిస్తారు. ఈ రకమైన ప్రదక్షిణ చేయడానికి తప్పనిసరిగా గురూపదేశం కావాలి. సోమసూత్రం దాటకూడని చోటు అంటే అభిషేక జలాలు పడేచోట కట్టిన చిన్న కుండీని దాటవద్దని మాత్రమే అని అర్థం. అంతేకానీ జలం ప్రవహించినంత దూరం నడవొద్దని మాత్రం కాదు.

## శివదర్శనం ఏయే వేళల్లో చేయాలి? శివదర్శన ఫలం ఏమిటి?



శివదర్శనం మూడువేళల్లోనూ చేయవచ్చు. సూర్యోదయ, సూర్యాస్తమయ కాలాలను ప్రదోష కాలాలు అంటారు. ప్రదోష సమయాల్లో శివదర్శనం చేసుకుంటే గ్రహదోషాలు తొలగిపోతాయి. సర్వసంపదలూ లభిస్తాయి. శివరాత్రినాడు అర్ధరాత్రి శివదర్శనం చేసుకుంటే శాశ్వత కైలాస నివాసం లభిస్తుంది. రాహుకాలంలో శివుడిని దర్శించినా, అభిషేకించినా పదవులు, ఉద్యోగాలు లభిస్తాయి. మధ్యాహ్నం పన్నెండుగంటల వేళ శివదర్శనం చేసుకుంటే భార్యాభర్తల మధ్య అన్యోన్య దాంపత్యం కుదురుతుంది.

## శివద్రవ్యం తాకకూడదు అంటారు. ఎందుకు? అసలు శివద్రవ్యం అంటే ఏమిటి?

శివుడికి సమర్పించిన సమస్త వస్తువులే శివద్రవ్యం. శివునిపై ఉంచిన బిల్వపత్రాలు, పూలు, అక్షతలతో పాటు శివుడికి సమర్పించిన నైవేద్యం, వస్త్రం ఇవన్నీ శివద్రవ్యాలే. ఇవి అత్యంత పవిత్రమైనవి, శక్తివంతమైనవి. వీటిని తాకకూడదు అని ఏ శాస్త్రమూ చెప్పలేదు. శివనిర్మాల్యంపై అధికారం చండీశ్వరునిది. స్వయంభూ లింగాలు, నర్మదా బాణలింగాలు, రత్ననిర్మిత లింగాలు, రసనిర్మిత లింగాలు, సిద్ధప్రతిష్ఠిత లింగాల వద్ద మాత్రం చండీశ్వరునికి అధికారం లేదు. శివునికి సమర్పించిన పూలు, పత్రాలు మనకు



ప్రసాదంగా ఇచ్చినప్పుడు, వాటి పవిత్రతను కాపాడలేని పరిస్థితిలో నందీశ్వరునిపై ఉంచాలి. వాటిని భరించే శక్తి, అధికారం నందికి మాత్రమే శివుడు ఇచ్చాడు. శివుని ద్రవ్యాన్ని ఎవ్వరూ తీసుకుపోరాదు. ధనరూపంలోని శివద్రవ్యాలను, ముఖ్యంగా శివాలయ మాన్యాలను అపహరించే వారు నీచజన్మలకు వెళతారు. వంశక్షయమవుతుంది. దారిద్ర్యం పీడిస్తుంది.



## శివ ప్రసాదం ఇంటికి తెచ్చుకోకూడదా?

తెచ్చుకోవచ్చు. అయితే శివునికి నివేదన చేసిన సమస్తం చండీశ్వరునికి చెందుతుంది. వీటిలో ఆలయం లోపల స్వీకరించే తీర్థప్రసాదాలపైనా నిషేధం లేదు. నిరభ్యంతరంగా తీసుకోవచ్చు. ఇంటికి తెచ్చుకోవాలనుకున్నప్పుడు మాత్రం చేతితో చప్పట్లు చరచాలి. అది చండీశ్వరుని అనుజ్ఞ కోరడానికి సంకేతం. అప్పుడు శివప్రసాదాన్ని ఇంటికి తెచ్చుకోవచ్చు. తినేందుకు ఇచ్చిన ప్రసాదం అయితే కళ్లకద్దుకుని భుజించి తీరాలి. శివప్రసాదం మనకు ఇహపరాలు రెంటినీ ఇస్తుంది. అసలు శివునికి నైవేద్యం పెట్టకుండా ఆహారం తీసుకుంటే అది శవభక్షణతో సమానమని శాస్త్రాలు చెబుతున్నాయి.

## శుద్ధిచేసిన నీటితో శివుడికి అభిషేకం చేయొచ్చా?

మనం తాగడానికి ఉపయోగించే నీటితోనే అభిషేకం చేయడం తప్పేమీ కాదు. అయితే కొన్ని నియమాలు పాటించాలి. బావి, చెరువుల నుంచి మడిగా తెచ్చిన నీటిని యథాతథంగా అభిషేకం చేయరు. నీటిలోని విషాన్ని హరించేందుకు మొదటిగా నీటి కలశంపై గరుడముద్రను పడతారు. రెండు చేతుల చిటికెన వేళ్లను తోకలా పట్టుకుంటారు. ఉంగరం, మధ్య, చూపుడువేళ్లను కలిపి రెక్కల్లా చూపెడతారు. బొటనవేలిని మెలిపెడతారు. ఇది గరుడపక్షి క్రిందికి వాలుతున్నట్లుగా ఉంటుంది. దీనితర్వాత అమృతముద్రను పడతారు. దీనికే ధేనుముద్ర అని మరోపేరు. చేతివేళ్లన్నీ కామధేనువు పొదుగుల్లా కనిపిస్తుందీ ముద్రలో. ఈ అమృతముద్రను అభిషేక కలశంపై ఉంచి 'వం' అనే అమృతబీజాన్ని, మృత్యుంజయ మంత్రాన్ని పఠిస్తారు. అలా విషరహితం, అమృతమయము అయిన నీటితో రుద్రాభిషేకం చేయడం సంప్రదాయం.




RNI Regn.No.TELTEL/2015/66688 | Postal Regd.No. HCD-5002/2016-2018
Date of Posting : 28th of every month | Date of Publication : 25th of every month



## సాయంసంధ్యవేళలో నందికొమ్ముల నుంచి శివలింగం చూడనక్కరలేదా?

శివుడెప్పుడూ తనపైనే తిరగాలని నందీశ్వరుని కోరిక. ఎదురుగా లింగమూర్తిగా ఉన్నప్పుడు కూడా నంది తన ఉచ్ఛ్వాసనిశ్వాసలతో శివునికి చామరం వీస్తూ ఉంటాడు. అటువంటి నందిసేవకు భంగం కలగకుండా ఉండేందుకు నంది రెండు కొమ్ముల మీద కుడిచేతిని ఉంచి, వేళ్లమధ్యనుంచి శివదర్శనం చేస్తారు. అయితే సాయంసంధ్యలో నందీశ్వరుని పృష్ఠభాగంలో పావన నదులన్నీ చేరుతాయని పురాణవాక్యం. అందువల్ల చీకటిపడిన తరువాత నంది తోకను నిమిరి, కొమ్ముల మధ్యనుంచే శివదర్శనం చేసుకోవాలి. అసురసంధ్యవేళ అంటే సూర్యాస్తమయానికి ముందు, వెనుక కలుపుకుని గంటన్నర కాలంపాటు పరమశివుని నిజరూప దర్శనం కలుగుతుంది. ఆ సమయంలో శివుణ్ణి నేరుగా దర్శించుకుని తరించవచ్చని శాస్త్రం.

## శివాలయ దర్శనానికి నియమాలేమిటి?

శివాలయంలో తప్పనిసరిగా మూడు లింగాలను దర్శించాలి. వీటినే లింగత్రయం అంటారు. ఆలయ గోపురాన్ని స్థూలలింగంగా భావించాలి. విమానంపై ఉండేది కూడా స్థూలలింగమే. బలిపీఠం భద్రలింగం. మూలమూర్తి సూక్ష్మలింగం. ఆలయాన్ని సమీపిస్తూనే మొదట గోపురానికి నమస్కరించాలి. ధ్వజస్తంభం వద్ద సాష్టాంగ నమస్కారం చేయాలి. ధ్వజస్తంభం వద్ద తప్ప శివాలయంలో మరెక్కడా సాష్టాంగ పడకూడదు. మొదటిసారి ఆలయ ప్రదక్షిణ చేయాలి. నంది అనుమతి



పొంది ఆలయంలో ప్రవేశించాలి. మొదట వినాయకుని, ఆ తరువాత శివుని, అమ్మవారిని, ఉత్సవ విగ్రహాన్ని కూడా దర్శించి మొక్కాలి. రెండోసారి ఆలయ ప్రదక్షిణం చేసుకోవాలి. ఇతర పరివార దేవతలను దర్శించి నమస్కరించాలి. ఆపై సుబ్రహ్మణ్యుని దర్శించి, నవగ్రహ సన్నిధికి వెళ్లాలి. చివరిగా మూడోసారి ఆలయానికి ప్రదక్షిణ చేయాలి. అప్పుడు చండీశ్వరుని దర్శించాలి. శివాలయ దర్శన ఫలితాన్నిచ్చేది చండీశ్వరుడే. చివరగా ధ్వజస్తంభం వద్దకు వచ్చి మరోసారి సాష్టాంగ నమస్కారం చేయాలి.

## దీపారాధన చేసినప్పుడు పఠించదగిన శ్లోకాలేవి?



**సంధ్యాదీపం వెలిగించినప్పుడు**

దీపంజ్యోతి పరంబ్రహ్మ దీపం సర్వతమోపహం
దీపేన సాధ్యతే సర్వం సంధ్యాదీప నమోస్తుతే

లేదా

దీపంజ్యోతిః పరబ్రహ్మ దీపంజ్యోతిః నమో నమః
దీపేన హరతేపాపం దీపదేవి నమో నమః

**ఎప్పుడు దీపారాధన చేసినా...**

దీపస్త్వం బ్రహ్మరూపోసి జ్యోతిషాం ప్రభురవ్యయః
సౌభాగ్యం దేహి పుత్రాంశ్చ సర్వాంకామాంశ్చ దేహిమే

భక్త్యా దీపం ప్రయచ్ఛామి దేవాయ పరమాత్మనే
త్రాహిమాం నరకాత్ ఘోరాత్ దివ్యజ్యోతిర్నమోస్తుతే

**పూజాప్రారంభంలో....**

భో దీపదేవి రూపస్త్వం కర్మసాక్షీ హ్యవిఘ్నకృత్
యావత్పూజాం కరిష్యామి తావత్వం సుస్థిరోభవ

**పూజమధ్యలో...**

సాజ్యం త్రివర్తి సంయుక్తం వహ్నినా ద్యోతితామయం
గృహాణ మంగళం దీపం త్రైలోక్య తిమిరాపహం

**లక్ష్మీదేవి వద్ద దీపం వెలిగించినప్పుడు**

ఘృతాక్తవర్తి సంయుక్తం అంధకార వినాశకం
దీపం దాస్యామి తేదేవి గృహాణ ముదితాభవ



**శ్రీసూక్తంలో...**

ఓం ఆర్ద్రాం పుష్కరిణీం పుష్టిం పింగళాం పద్మమాలినీం
చంద్రాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మమావహ

**దీపావళినాడు**

శ్రీరూపేంద్ర సదనే మదనైక మాతా
జ్యోత్స్నయిసి చంద్రమసి సహోదరాస్యే
సూర్యేప్రభాసిత జగత్ త్రికయే
ప్రభాసి లక్ష్మి నమతాం శరణ్యే.... శ్రీమహాలక్ష్మి దేవ్యై నమః దీపం దర్శయామి


RNI Regn.No.TELTEL/2015/66688 | Postal Regd.No. HCD-5002/2016-2018
Date of Posting : 28th of every month | Date of Publication : 25th of every month

పురుషసూక్తంలో...
చంద్రమా మనసో జాతః చక్షోః సూర్యో అజాయత
ముఖాదింద్రశ్చాగ్నిశ్చ ప్రాణాద్వాయురజాయత

శివారాధనలో...
ఓం బలప్రమథనాయ నమః
సుప్రకాశో మహాదీపః సర్వతః తిమిరాపః
సబాహ్యాభ్యంతర జ్యోతిః దీపోయం పరిగృహ్యతాం
శ్రీశంకర దేవతాయై నమః దీపం దర్శయామి

కేదారేశ్వర దీపం
యోగినాం హృదయేష్వేవ జ్ఞానదీపాంక దోహ్యషి
బాహ్య దీపోమయాదత్తః గృహ్యతాం భక్త గౌరవాత్
శ్రీకేదారేశ్వరాయ నమః దీపం దర్శయామి

వినాయకుని వద్ద దీపం వెలిగించినప్పుడు...
సర్వజ్ఞ దేవ దేవేశ సర్వసిద్ధి ప్రదాయక
గృహాణ మంగళం దీపం రుద్రప్రియ నమోస్తుతే

తులసికోట వద్ద
ఘృతవర్తి దీప్తంతే మయార్తి మిదంశుభే
గృహాణ మంగళం దీపం సర్వైశ్వర్య ప్రదాయినీ
శ్రీతులస్యై నమః దీపం దర్శయామి

పార్వతీమాత వద్ద
శ్రేతార్థవర్తి సంయుక్తం గోఘృతేన సమన్వితం
దీపం భక్త్యా గృహాణేదం త్రైలోక్య ధ్వాంత సమన్వితం
దీపం భక్త్యా గృహాణేదం త్రైలోక్య ద్వాంత నాశినే
ఐం ఈం సౌం శ్రీం నమః దీపం దర్శయామి

గురువులను తలచుకుంటూ...
నిరామయ నిరాకార తమోహర
పంచవర్తి సమాయుక్తం భక్తిజ్ఞాన ప్రదీపకం
శ్రీ గురుదేవాయ నమః దీపం దర్శయామి


DEWALI

## శివపూజలో దీపారాధన నియమాలేంటి?

**రుద్రాభిషేక పూజాదౌ దీపం ప్రజ్వాలయేత్సుధీః**
**అఖండ దీపహీనాయా సా పూజా నిష్ఫలాభవేత్**

శివాభిషేక ప్రారంభంలోనే అఖండ దీపారాధన చేయాలి. అది పూజ పూర్తయ్యేవరకు వెలగాలి. దీపారాధన లేకుండా చేసిన అభిషేక పూజాదులు నిష్ఫలమని రుద్రకల్పం చెబుతోంది. అఖండ దీపారాధన కనీసం ఏడుఅంగుళాల ఎత్తులో చేయాలి. అంత ఎత్తువరకు ధాన్యం లేదా బియ్యం పోసి అఖండ దీపారాధన చేయవచ్చు. దీపం ఎప్పుడైనా ఏడు లేదా మూడు అంగుళాల ఎత్తులో అధమపక్షంలో ఒక్క అంగుళం ఎత్తులో వెలిగించవచ్చు.

**కపిలాది ఘృతం చైవ తిలతైల మధాపివా**
**బిల్వాది వృక్ష తైలంచ దీపతైల మిహోచ్యతే**

కపిలగోవు నెయ్యి, నువ్వుల నూనె, మారేడునూనె శివపూజలో సర్వశ్రేష్ఠమైనవని మేరుతంత్రం చెప్పింది. కాగా ఆముదం, వేపనూనె, ఆవనూనె, అవిశెనూనె వంటి తైలాలన్నీ శివపూజలో నిషేధం. వాడకూడదు.

1 – 3 – 5 – 7 – 9 దారాలతో పేనిన వత్తితో దీపాలు వెలిగించవచ్చు. ఎక్కువ దీపాలు వెలిగించేటప్పుడు వరుసగా 8 – 12 – 16 – 32 దీపాలు వెలిగించవచ్చు. ఎక్కువ దీపాలు పెట్టినప్పుడు మధ్యలో దీపం తప్పనిసరిగా పెట్టాలి.



**అధాత స్సంప్రవక్ష్యామి శివదం శివదీపకం**
**సర్వపాప ప్రశమనం సర్వోపద్రవ నాశనమ్**

మంగళప్రదమైన శివదీపం సర్వపాప హరం. సర్వ ఉపద్రవాలను నాశనం చేస్తుంది. శివునికి తూర్పున ఉంచిన దీపం శివప్రీతి కలిగిస్తుంది. పశ్చిమభాగంలో ఉంచిన దీపం వల్ల వరాలు కురుస్తాయి. మిగిలిన అన్ని కోరికలూ నెరవేరడానికి శివునికి ఉత్తరదిక్కున దీపారాధన చేయాలి. ఆవునేతి దీపారాధన శివునికి కుడిభాగంలోనూ, నువ్వులనూనె దీపారాధన ఎడమవైపు చేయాలని మేరుతంత్రమే స్పష్టపరిచింది.

# శివ మంగళాష్టకం

భవాయ చంద్రచూడాయ నిర్గుణాయ గుణాత్మనే
కాలకాలాయ రుద్రాయ నీలగ్రీవాయ మంగళమ్ || 1 ||

వృషారూఢాయ భీమాయ వ్యాఘ్రచర్మాంబరాయ చ
పశూనాంపతయే తుభ్యం గౌరీకాంతాయ మంగళమ్ || 2 ||

భస్మోద్ధూళితదేహాయ నాగయజ్ఞోపవీతినే
రుద్రాక్షమాలాభూషాయ వ్యోమకేశాయ మంగళమ్ || 3 ||

సూర్యచంద్రాగ్నినేత్రాయ నమః కైలాసవాసినే
సచ్చిదానందరూపాయ ప్రమథేశాయ మంగళమ్ || 4 ||

మృత్యుంజయాయ సాంబాయ సృష్టిస్థిత్యంతకారిణే
త్రయంబకాయ శాంతాయ త్రిలోకేశాయ మంగళమ్ || 5 ||

గంగాధరాయ సోమాయ నమో హరిహరాత్మనే
ఉగ్రాయ త్రిపురఘ్నాయ వామదేవాయ మంగళమ్ || 6 ||

సద్యోజాతాయ శర్వాయ భవ్య జ్ఞానప్రదాయినే
ఈశానాయ నమస్తుభ్యం పంచవక్త్రాయ మంగళమ్ || 7 ||

సదాశివ స్వరూపాయ నమస్తత్పురుషాయ చ
అఘోరాయ చ ఘోరాయ మహాదేవాయ మంగళమ్ || 8 ||

మహాదేవస్య దేవస్య యః పఠేన్మంగళాష్టకమ్
సర్వార్థ సిద్ధి మాప్నోతి స సాయుజ్యం తతః పరమ్ || 9 ||



# కార్తీక మాసం వైభవం

శివ దేవునికి ఎక్కువ ప్రీతిపాత్రమైన మాసం కార్తీక మాసం. ప్రతి ఏటా దీపావళి వెళ్ళిన మరుసటి రోజు నుంచి అతి పవిత్రమైన కార్తీక మాసం ప్రారంభమవుతుంది. ఈ మాసంలో భక్తులంతా నిత్యం భోళాశంకరుని నామాన్ని స్మరిస్తూ ఉంటారు. పురాణ కాలంనుంచీ ఈ మాసం ఓ ప్రత్యేకతను సంతరించుకుంది.

హరిహరాదులకు ప్రీతిపాత్రమైన ఈ మాసంలో భక్తకోటి యావత్తూ కఠిన నిష్ఠతో చేపట్టే నోములకు ఎంతో ప్రాధాన్యం ఉంది. ఈ మాసంలో పాడ్యమి, చవితి, పౌర్ణమి, చతుర్దశి, ఏకాదశి, ద్వాదశి తిధుల్లో శివ పార్వతుల అనుగ్రహం కోసం మహిళలు పూజలు చేస్తుంటారు. పట్టణాల్లోనే కాకుండా గ్రామాల్లో సైతం మహిళలు ఈ మాసంలో విశేష పూజలు జరుపుకుంటారు.

## హరిహరాదులకు ప్రీతికరం... కార్తీక మాసం

మన భారతీయ సంస్కృతిలో కార్తీకమాసం వచ్చింది అంటే ఆ నెల రోజులు పండుగదినాలే! అందులోను కార్తీకమాసం ఈశ్వరారాధనకు చాలా ముఖ్యమైనది. దేశం నలుమూలలా ఉన్న వివిధ ఆలయాలలో రుద్రాభిషేకాలు, రుద్రపూజ, లక్ష బిల్వదళాలతో పూజలు, అమ్మవారికి లక్షకుంకుమార్చనలు, విశేషంగా జరుపుతూ ఉంటారు. అలా విశేషార్చనలు జరిపే భక్తులకు సదాశివుడు ప్రసన్నుడై కొంగుబంగారంలా సంతోషం కలిగిస్తాడు. కావున ఆ స్వామికి ''ఆశుతోషుడు'' అను బిరుదు కలిగింది.



**''హరిః ఓం నమస్తే అస్తు భగవన్విశ్వేశ్వరాయ మహాదేవాయ త్ర్యంబకాయ**
**త్రిపురాంతకాయ త్రికాలాగ్నికాలాయ కాలాగ్ని రుద్రాయ నీలకంఠాయ**
**మృత్యుంజయాయ సర్వేశ్వరాయ సదాశివాయ శ్రీమన్మహాదేవాయ నమః** "అంటూ! ప్రతి ఈశ్వ రాలయంలో ఆ రుద్ర నమకం మంత్ర భాగము మారుమోగిపోతూ, ప్రతిధ్వనిస్తూ ఉంటుంది. హిందు వుల గృహాలలో ''ఆదిత్యమంబికా విష్ణూగణనాథం మహేశ్వరం'' అనే పంచాయతన దేవతలను విశ ేషంగా ఆరాధిస్తారు.

ఈ కార్తీక మాసమహాత్యమును గూర్చి పూర్వం నైమిశారణ్య ఆశ్రమములో శౌనకాది మహామునులకందరకు సూతమహాముని ఎన్నో విష్ణు భక్తుల చరిత్రములు, విష్ణు మహిమలను వినిపించు సమయాన, ఓ సూతముని శ్రేష్ఠా! కలియుగమందు ప్రజలు సంసార సాగరమునుండి తరింపలేక, అరిషడ్వర్గములకు దాసులై! సుఖమగు మోక్షమార్గము తెలియక ఎన్నో ఈతిబాధలు అనుభవిస్తున్న ఈ మానవులకు ధర్మములన్నింటిలో ఉత్తమ ధర్మమేది? దేవతలు అందరిలోనూ ముక్తి నొసంగు ఉత్తమదైవమెవరు? మానవునికి ఆవరించియున్న ఈ అజ్ఞానమును రూపుమాపి పుణ్యఫల మిచ్చు కార్యమేది? ప్రతిక్షణము మృత్యువుచే వెంబడించబడు ఈ మాన వులకు మోక్షము కలిగించు చక్కని ఉపాయము చెప్పుమని కోరినారు.

ఆ ప్రశ్నలను ఆలకించిన సూతముని, ఓ ముని పుంగవులారా! క్షణికకమైన సుఖభోగాల కోసం పరితపించుచూ! మందబుద్ధులగుచున్న మానవులకు ''ఈ కార్తీకమాస వ్రతము'' హరిహరాదులకు అత్యంత ప్రీతికరమైనది. దీనిని ఆచరించుట వల్ల సకల పాపాములు హరింపబడి మరు జన్మలేక పరంధామము పొందగలరు. పుణ్యాత్ములకు మాత్రమే ఈ కార్తీకమాస వ్రతమాచరించాలని కోరికను కలుగచేస్తాడు ఆ పరమాత్మ! దుష్టులకు దుర్మా ర్గులకు వారి కర్మలు పరిపక్వమయ్యేవరకు ఏవగింపు కలిగిస్తాడు.

ఈ మాసమందు వచ్చు సోమవారములు చవితి ఏకాదశి, ద్వాదశి, పౌర్ణమి, అత్యంత పుణ్యప్రదమైనవి. నెల అంతా సాధ్యపడని భక్తులు కనీసం ఆయా దినములలో పవిత్రపుణ్య నదీ స్నానమాచరించి, ఉపవాస దీక్షలు చేస్తూ మహాన్యాస పూర్వక మహా రుద్రాభిషేకములు, లక్ష బిల్వార్చనలు, లక్ష కుంకుమార్చనలు, లలిత, విష్ణు సహస్రనామ పారాయణలు, ప్రతి నిత్యము ఉభయ సంధ్యలలో దీపారాధన చేయువార్కి విశేష పుణ్య ఫలం లభిస్తుంది. ఈ కార్తీకమాస ముప్పది దినములు ఆచరించిన వార్కి అనంతకోటి పుణ్యఫలం లభిస్తుందని చెప్పబడినది.

ఇందు అత్యంత మహిమాన్వితమైన కాలం ప్రదోషకాలం. సూర్యాస్తమయమయ్యాక మూడు గడియలు (ఒక గంట) ప్రదోషోరజనీముఖమ్. రాత్రికి ఆరంభ కాలమే ఈ ప్రదోష సమయం. ఇలా ప్రతి నిత్యము వచ్చు ప్రదోషాన్ని నిత్య ప్రదోషంగా చెప్తారు. ఈ ప్రదోషం నాలుగు విధాలుగా మహాత్ములు వివరిస్తూ ఉంటారు. 1. నిత్య ప్రదోషం. 2. పక్ష ప్రదోషం 3. మాస ప్రదోషం 4. మహాప్రదోషం అని చెప్తారు.

కొందరు నిష్టాపరులు ఈ కార్తీకమాసమంతా పుణ్యనదీస్నానమాచరిస్తూ ప్రతి నిత్యము హరిహరాదులను పూజిస్తూ పగలు అపక్వాహారం అంటే వండని ఆహారం. పాలు, పండ్లు స్వీకరించి సాయంత్రం భక్తితో కార్తీక దీపారా ధనలు, పూజలు కావించి, నివేదించిన అన్నాన్ని రా త్రి భుజిస్తూ ఉంటారు. ఇలా ఈ కార్తీక నక్తవ్రతాన్ని నిత్యం ఆచరిస్తారు.ఇక ప్రదోషకాలంలో పరమేశ్వరుడు ఏక కాలంలో రెండు రూపాల్ని ప్రదర్శిస్తూ ఎడమ భాగాన పార్వతి, రెండవ భాగమున పరమేశ్వరరూపంగా ''అర్ధనారీశ్వ రుడుగా'' దర్శనమిచ్చే కాలం ఈ ప్రదోషకాలం అని చెప్పబడినది. ఆ ప్రదోష సమయాల్లో ఆ తల్లి ''అధ్యక్షురాలు''గా అధిరోహించియుండగా! పరమే శ్వరుడు పరవశించి తాండవం చేస్తూ ఉంటాడు. ఆ నృత్యాన్ని దర్శించటానికి దేవతలందరూ అక్కడ కొలువుతీరి ఉంటారుట! ఆ సమయంలో ఆ తాండవ నృత్యానికి అనుగుణంగా సరస్వతి దేవి వీణవాయి స్తూ ఉంటే బ్రహ్మ తాళం వేస్తాడట. శ్రీ మహాలక్ష్మీ గానం చేస్తూ ఉంటే! శ్రీ హరి మృదంగం వాయిస్తా డుట. ఇంద్రుడు వేణునాదంతో పులకింపచేస్తూ ఉంటాడు! అట్టి ప్రదోష సమయాల్లో దేవగంధర్వ మహర్షి సిద్ధులందరూ పరమాత్మ స్వరూపాన్ని కొలుస్తూ ఉంటారుట.

కనుక ప్రదోష సమయాల్లో శివుని ఆరాధిస్తే! శివుని ఆశీస్సులతోపాటు మిగతా దేవతల ఆశీస్సులు కూడా ఏకకాలంలో మనం పొందగలుగుతామని చెప్పబడినది. ఇంకా మనకు ఆ అర్ధనారీశ్వర స్వరూపాన్ని ధ్యానిస్తే! రెండు ప్రయోజనాలు లభిస్తాయట. కామం! అంటే కోర్కెలను నియంత్రించే శక్తి మరియు కాలాన్ని అంటే మరణాన్ని జయించే శక్తిని ప్రసా దిస్తాడుట! ఇంకా ఈ ప్రదోష దర్శనం సర్వశుభాలను కలుగచేసి, సర్వదారిద్ర్య బాధలను తొలగించి సర్వసంపత్తులు అనుగ్రిహా స్తుంది అని చెప్పబడినది.
ఈ కార్తీకమాసంలో అత్యంత విశేషమైనది. ఉత్థానైకాదశి అంటే శ్రీ మహావిష్ణువు పాలకడలిలో ఆదిశేషుని పాన్పుపైన ఆషాడ శుద్ధ ఏకాదశినాడు తనయోగనిద్రను ప్రారంభించి తిరిగి కార్తీక శుద్ధ ఏకాదశి నాడు కనులు విప్పియోగ నిద్ర నుండి మేల్కొన్న రోజుకే ఉత్థాన ఏకాదశి అను పేరు. ఆ మరుసటి రోజు ద్వాదశినాడు ముప్పది ముగ్గురు దేవతలలో శ్రీ మహాలక్ష్మీ సమేతుడై తులసీ ధాత్రివనమందు ఉంటాడని చెప్తారు.

ఈ ద్వాదశిని క్షీరాబ్ధి ద్వాదశి అంటారు అంటే, పూర్వం కృతయుగంలో దేవదానవులు పాలసముద్ర మధనము చేసిన రోజు. కనుక దీనికి క్షీరాబ్ధి ద్వాదశి అను పేరు వచ్చినది. పాల సముద్రమును చిలికారు కనుక చిల్కు ద్వాదశి అని కూడా అంటారు. కనుక స్త్రీలు ఈ రోజు వారి సౌభాగ్య సంపదల కోసం తులసీ ధాత్రి (తులసికోట) వద్ద విశేష దీపారాధ నలు గావించి షోడశోపచారములతో తులసీధాత్రి లక్ష్మీనారాయణులను పూజిస్తారు. ఆ రోజు దేశము నలుమూలలా గల ఆలయాలలోని లక్ష్మీనారాయణ మూర్తులను మిరుమి ట్లు గొలిపే విద్యుత్ దీపకాంతితో, బాణసంచాలతో సమీప నదీజాలలో తెప్పోత్సవం నిర్వ హిస్తూ ఉంటారు. కార్తీక పూర్ణిమనాడు వరిగడ్డిని వెంటిగా చుట్టి దానిని రెండు స్తంభము లకు కట్టి ఆ వెంటిని మూడుమార్లు కాగడాలతో వెలిగిస్తూ వాటి క్రింది పార్వతీ పరమే శ్వరుల ప్రతిమలను పల్లకిలో ఉంచి ముమ్మారు త్రిప్పి జ్వాలాతోరణ వేడుకను నిర్వహి స్తారు. అలా హరి హరాదులకు ప్రత్యేక ఉత్సవ వేడుకలు నిర్వహిస్తారు. ఇలా ఈ కార్తీక మాస విశేషాలను కొనియాడి చెప్పుటకు సహస్రముఖములు కలిగిన ఆదిశేషుడు, చతు ర్ముఖుడైన బ్రహ్మకే సాధ్యం కాదని చెప్పగా, ఇక మానవ మాత్రులమైన మనమెంత? అని సూతమహాముని చెప్పియున్నారు.

మన సంస్కృతిలో ఈ దీపారాధన అనేది ప్రధానాంశం. ఈ దీపదానమందు ఆవునెయ్యి ఉత్తమోత్తమమైనది. మంచి నూనె మధ్యమము, ఇప్పనూనె అధమము, ఇతరములైన అడవియందు పుట్టిన నూనెలు అధమాతి అధమములు. గేదె నేతితో దీపము, వెలిగించిన పూర్వ పుణ్యము కూడా నశించి పోతుంది. అదే స్వల్పముగా ఆవునేయి కలిపి వెలిగించిన దోషములేదని, అలా! ఒకటి మొదలు వేయి వరకు దీపములు వెలిగించుట ఎంతో శుభ ప్రదమని వాటి సంఖ్యనుబట్టి వివిధ ఫలితాలు అందిస్తుందని, దీపదాన మహాత్యములో చెప్పియున్నారు. అట్టి దీపారాధన పూజామందిరమందు, దేవాలయములో గృహప్రాం గణములలో, తులసీ బృందావనమందు, మారేడు, రావి వంటి దేవతా వృక్షాల వద్ద, పుణ్య నదీతీరములందు వెలిగించుట అత్యంత పుణ్యప్రదమని పురాణాలు వర్ణించి చెబుతున్నాయి.



ఈ మాసమందు సోదరి చేతివంట భగనీ హస్తభోజనము చేసి యధాశక్తి వార్కి కాను కలు సమర్పించుటతోపాటు, సమీప వన మందు బంధువులు, స్నేహితులతోకూడి ఉసి రిచెట్టును పూజించి, సాత్విక ఆహారముతో వన భోజనములు చేస్తూ ఉండుట మంచిది. అం దువల్ల మన జీవన గమనంలో మంచి ఆహ్లాదము తోపాటు అన్నదాన ఫలితము కూడా లభిస్తుంది.

అట్టి మహిమాన్వితమైన ఈ కార్తీకమాసమందు నియమనిష్టలతో హరిహరాదులను అనునిత్యము ఆరాధిస్తూ ''కార్తీకపురాణ'' పఠనము గావించిన ఎడల అనంతకోటి పుణ్యఫలం లభిస్తుందని, ఈ పవిత్ర పుణ్యదినములందు అలసత్వం వహించకుండా యథాశక్తి దీపదానము, వస్త్ర, ఫల, పుష్ప, సువర్ణ దానములు మొదలైనవి చేయుటవల్ల ఇహమందు సర్వసుఖములు అనుభవించుటయే కాకుండా, జన్మాంతరమందు జన్మరాహిత్యాన్ని పొందగలరని ఈ కార్తీకమాస వ్రతమహాత్యమును గూర్చి సూతమహాముని శౌనకాది మునులకు వివరించినాడు.

### విశిష్టత

ఆయా మాసాలలో చంద్రుడు పూర్ణుడై ఏ నక్షత్రంలో ఉంటాడో ఆ నక్షత్రం పేరే ఆ మాసానికి వస్తుంది. కృత్తికా నక్షత్రంపై చంద్రుడు పూర్ణుడై ఉండటంవల్ల ఈ మాసానికి కార్తీకమాసమని పేరు. ఈ మాసంలో కృత్తిక నక్షత్రానికి, దీపారాధనకు, సోమవారాలకు ప్రాధాన్యత ఉంది. ఈ విషయాలను గురించి ఇప్పుడు తెలుసుకుందాం.

**కృత్తికా నక్షత్రం:**కృత్తికానక్షత్రానికి నక్షత్రాలలో మంచి ప్రాముఖ్యత ఉంది. దేవతలలో ప్రథముడైన అగ్నిదేవుడు ఈ నక్షత్రానికి అధి పతి. అగ్ని నక్షత్రాలైన కృత్తిక, ఉత్తర, ఉత్తరాషాడలలో మొదటిది కృత్తికయే. వేదకాలంలో సంవత్సరం కృత్తికా నక్షత్రం తోనే ఆరంభమయ్యేది. ఈ నక్షత్రాన్ని అగ్ని నక్షత్రమని అంటారు. అగ్ని ఆరు ముఖాలు కలవాడు. కృత్తికలు కూడా ఆరు నక్షత్రాలు. ఈ కృత్తికలు ఒక విశిష్టత ఉంది. అదేమిటంటే కుమారస్వామిని షణ్ముఖుడు అంటారు. అంటే ఆరు ముఖములు కలవాడని అర్థం. ఆకాశంలోని ఆరు కృత్తికా నక్షత్రములు మాతృమూర్తులై పాలు యివ్వగా కుమార స్వామి ఆరు ముఖాలతోపాలు త్రాగాడు. ఈ విధంగా కృత్తికలచే పెంచబడుటచే కుమరస్వామికి కార్తికేయుడని పేరు వచ్చినది. ఈ కారణాల వల్ల కృత్తికలకు ప్రాముఖ్యం కలిగినది.

**కార్తీక దీపాలు:**ఈ మాసంలో చెప్పుకోదగ్గ మరో అంశం దీపారాధన. ఈ మాస ప్రారంభం నుండి సూర్యోదయానికి పూర్వమే లేచి నదీస్నానమాచరించి శుచియై, పొడిబట్టలు ధరించి దీపారాధన చేయవలెను. ఈ మాసంలోనే జ్వాలా తోరణాన్ని కొన్ని చోట్ల వెలిగిస్తారు. ఈ కాలమంతా దేవాలయాలన్నీ దీపాలచే అలంకరించబడి ప్రజలను ఉత్తేజపరుస్తూ శోభాయమా నంగా ఉంటాయి. ప్రతి ఇంటి ముంగిట ఈ మాసాంతం వరకు దీపం వెలుగుతూ ఉంటుంది. కార్తీకమాసంలో స్త్రీలు నదులలో, కోనేటిలలో దీపాలు వదలుతారు. ఈ దీపాలు ఆకాశంలోని చుక్కలవలె ప్రకాశవంతంగా వెలుగుతూ కన్ను లపండుగను కలుగచేస్తాయి. ఈ మాసంలో స్త్రీలు దీపాన్ని దానంగా ఇస్తారు. దీని వల్ల వారికి ఎనలేని కీర్తిసౌ భాగ్యాలు కలు గుతాయని భావిస్తారు. ఈ దీపాలు మనిషిలోని అజ్ఞానమునే చీకటిని తొలగించి జ్ఞానమనే వెలుగును నింపుతాయి.



**కార్తీక సోమవారాలు:**ఈ మాసవారాలలో సోమవారానికి ప్రత్యేకత ఉంది. సోమవారానికి చంద్రుడు అధిపతి. దేవతలలో ప్రథముడైన అగ్ని నక్షత్రాలలో మొదటిదైన కృత్తికను అధిపతిగా ఉండటం, చంద్రుడు పూర్ణుడై ఈ నక్షత్రం మీద ఉండటం చేత మాసం లోని సోమవారాలకు విశిష్టత కలిగినది. చంద్రుని వారమైన ఈ సోమవారం శివునికి ఎంతో ప్రీతికరమైనది. శైవభకు ్తలు ఈ మాసంలో ముఖ్యంగా సోమవారాలలో భక్తిశ్రద్ధలతో నియమనిష్టలతో శివుణ్ణి ఆరాధిస్తారు. ఈ మాస కాలంలో సూర్యోదయ పూర్వమే బ్రహ్మ ముహూర్తమున నదీ స్నానమాచరించి హరహరశంభో అంటూ శివుణ్ణి స్తుతి స్తూ భక్తి ప్రపంచంలో మునిగిపోతారు. ముఖ్యంగా శైవభక్తులు ఈ మాసమంతా ఉపవాసముండి శివుడిని పూజిస్తారు. శివప్రీతి కరమైన సోమవారమున భానోదయం ముందు లేచి స్నానాదికార్యాక్రమాలు ముగించుకుని, పొడి బట్టలు ధరించి మొ దటగా దీపారాధన చేయాలి. అనంతరం శివుడికి రుద్రాభిషేకం చేయించి శివవ్రత నియమాలను పాటించాలి. ఈ విధంగా చేయడం వల్ల నిత్యమూ సిరిసంపదలతో, సుఖసౌఖ్యాలతో వర్ధిల్లుతారని ప్రజల నమ్మకం. సూర్యుడు తులారా శి యందు ప్రవేశించిన నాటి నుండిగాని, కార్తీక మాసారంభదినమగు శుద్ధపాడ్యమి మొదలు కొనిగాని వ్రతారంభము ను చేయవలెను. అట్లు ప్రారంభించు సమయంలో ఓ కార్తీక దామోదారా! నీకు వందనములు.

నాచే నారంభింపబడు కార్తీక వ్రతంబును విఘ్నము లేకుండ చేయుము అనిపిమ్మట స్నానముచేయవలెను.

ఆ విధముగ జీవనదికి బోయి గంగకును, శ్రీ మన్నారాయణునకును, భైరవు నకు ను నమస్కరించి భైరవాజ్ఞను తలదాల్చి మొలలోతు నీటిలో నిలువబడి మొ దట సంకల్పము జెప్పికొని సూక్తములను జదివి, మార్జన మంత్రముతోడను, అఘమ ర్షణ మంత్రముతోడను, గంగోదకమును శిరస్సున జల్లుకొని అఘమర్ష స్నానమా చరింపవలెను. పిదప సూర్యున కర్ఘ్య ప్రదానమొసంగి దేవతలకును, ఋషులకు ను, పితృదేవతలకును క్రమ ప్రకారముగ తర్పణంబు లొనర్పవలెను. అప్పుడది సుస్నామగును. స్నానము చేసిన పిమ్మట నదీతీరము జేరి మూడుదోసిళ్ళ నీరు గట్టుపైన పోయవలెను.

కార్తీకమాసంబున గంగా గోదావరి కావేరీ తుంగభద్రాదిన దులందు స్నానమొనర్చిన నత్యుత్తమము, గంగానది కార్తీకమాసమునందు నదుల న్నిటియందు ద్రవరూప సన్నిహితయై యుండును. శ్రీ ఆదినారాయణుండు గోష్పా ద మాత్ర ప్రదేశమందున్న జలము నందు సన్నిహితుడై ఉండునని వేదములు, శ్రుతీస్మృతులు చెప్పుచున్నవి కావున సముద్రకామియగు నదీ స్నానము మిగుల పవిత్రమైనది. నదీ స్నానావకాశము లభింపనిచో! కులువయందుగాని, చెరువునం దుగాని, కూపము కడగాని సూర్యోదయము స్నానము చేయవలెను. పిదప మడిబ ట్టలను ధరించి ముందుగ భగవంతుని స్మరింపవలెను. తదుపరి భస్మమును త్రిపుండ్రముగా నుదుట ధరింపవలెను. లేక గోపీచందనముపైన నుదుట నూర్ధ్వ పుండ్రముగా నుంచుకొనవలెను. అనంతరం సంధ్యావందనము, బ్రహ్మ యజ్ఞము ను ముగించి, నిత్యాగ్నిహోత్రమును గావించుకుని దేవతార్చనమును చేయవలె ను. స్నానతీర్థమునందే కార్తీక పురాణ శ్రవణమును చేయాలి.



సూర్యుడస్తమించు కాలమున సాయంసంధ్యను పూర్తి చేసికొని శివాలయముగాని, విష్ణ్వాలయమున గాని దీపారాధన చేయవలెను. షోడశోపచార పూజావిధానమున హరిహరులను బూజించి షడ్రసోపేతమై, భక్ష్యభోజ్యాదులతోగూడిన నైవేద్యము నిడవలయును. ఈ రీతిగా కార్తీకశుద్ధ ప్రతిపత్తు మొదలు అమావాశ్య తుదివరకు నక్త వ్రతము చేసినచో కార్తీక మాస వ్రతము పూర్తగును. మరునాడు శక్తిననుసరించి మృష్టాన్నముతో భూత తృప్తి గావించవలెను. కార్తీక మాసమున సోమవారమున శివప్రీతికై సోమవారవ్రతము నొనర్చినవారికి కైలాసమున శివుని సన్నిధానమున నుండుట ప్రాప్తించును. సోమ వా రవ్రత విధానమెట్టిదన – సోమవారమున నదీ స్నాన మొనర్చి సంపూర్ణముగ నుపవ సించి శివునకభిషేకమొనర్చి రాత్రి మొదటి యామమున భుజింపవలెను.

ఆ దినమున నితరుల వలననే పదార్థమును గ్రహింపరాదు. తిలదాన మొనర్చినందువలన పాపము లన్నియు నశించును. ఇంకనునత్యంత నిష్ఠతోను, భక్తితోను నాచరింపనవ కాశ మున్నవారు ఆ దినమున రాత్రిగూడ నిద్రింపక పురాణాది పఠనంబువలన జాగరణ మొనర్చి, మరునాడు శక్తి కొలదిగ బ్రాహ్మణులకు సంతర్పణమును చేసి పిదప భుజిం పవలెను. ఈ పై రెండును జేయలేనివారు సోమవారమున నపరాహ్ణము వరకుండి భుజించవలెను.ఇందేది చేయుటకు శక్తిలేనిచో నదీస్నానమును గావించుకుని భగవంతుని ధ్యానించవలెను సోమవారమునస్త్రీగాని, పురుషుడుగాని నక్షత్ర దర్శ నమగువరకుపవసించి పిమ్మట భుజించినవారి పాపములు

అగ్నిలోబడిన దూదివలె నాశనమగును.ఆ దినమున శివునికభిషేకమొనర్చి బిల్వదళంబులచే సహస్రనామార్చ నము నొనర్చినను, ఇతరులచే చేయించినను, శివపంచాక్షరీ మంత్రమును జపించి నను, వారిని శివుడనుగ్రహించి సర్వసంపదలను, సమస్త శుభంబులను చేకూర్చును.

## కార్తీక శుద్ధ ద్వాదశి వ్రతం

ఆషాడ మాసం లో శుద్ధ ఏకాదశి రోజున క్షీరసాగరం లో శయనించిన విష్ణుభగవానుడు ... కార్తీక శుద్ధ ఏకాదశి నాడు నిద్రనుండి మేల్కొంటాడని , అలా నిద్రనుండి మేల్కొనిన మరుసటి రోజే క్షీరాబ్ధిద్వాదశి పర్వ దినం గా భక్తులు పండుగను జరుపుకుంటారు .

కార్తీక శుద్ధ ద్వాదశీ వ్రతం విష్ణువుకు ఇష్టమైన వ్రతం . ఈ రోజున ఆవు కొమ్ముకు బంగారు తొడుగులు తొడిగి , ఆవు కాళ్ళకు వెండి డెక్కలు తగిలించి , దూడతో సహా బ్రాహ్మణుని కి దానమిస్తే ఆ ఆవు శరీము మీద ఎన్ని రోమాలున్నాయో అన్ని సంవత్సరాలు ఇంద్రలోకం లో స్వర్గసుఖాలు పొందుతారు .

కార్తీకశుద్ధ ద్వాదశి రోజు యజ్ఞోపవీతములు .. దక్షిణ తో బ్రాహ్మణునికి దానమిస్తే ... ఇహపర సుఖములు పొందుతారు . ఈ రోజున బంగారు తులసి చెట్టుగాని , సాలగ్రామాన్ని గాని బ్రాహ్మణుని కి దానమిస్తే నాలుగు సముద్రాల మధ్య ఉన్న భూమిని దానం చేసిన ఫలితం లభిస్తుంది . ఈ కార్తీక శుద్ధ ద్వాదశినే " ఉత్థాన ద్వాదశి " అంటారు .



# చరిత్ర కథలు :

- కృతయుగం లో దేవతలు , రాక్షసులు అమృతం కోసం క్షీరసాగర మదనాన్ని కార్తీక శుద్ధ ద్వాదశి నాడు చేసిన రోజు కనుకే " **క్షీరాబ్ధి ద్వాదశి** " అని పిలుస్తారు .
- అమృతం కోసం క్షీరసాగరాన్ని చిలికారు కనుక " **చిలుక ద్వాదశి**" అని ,
- అమృతం కోసం సాగరాన్ని మధించారు గనుక "**మధన ద్వాదశి**" అని వాడుకలో ఉంది .
- శ్రీమహావిష్ణువు లక్ష్మీ సమేతం గా బ్రహ్మ , ఇంద్రాది దేవతల తో కలసి బృందావనానికి వెళ్ళారు అంటారు ... అందుకే ఈ రోజుని " **బృందావని ద్వాదశి**" అని కుడా అంటారు .
- బృందా విష్ణువుల వివాహము (గాంధర్వ వివాహము)జరిగి బృంద తులసి చెట్టు గాను , విష్ణువు సాలగ్రామం (శిలగా)గా ఒకరిని ఒకరు శపించుకున్న రోజు గనుక " **బృంద ద్వాదశి** " అంటారు .
- క్షీరసాగర మధనము లో జన్మించిన లక్ష్మీదేవిని శ్రీమహావిష్ణువు దేవ దానవ సమక్షములో వివాహమాడుతాడు .
- చాతుర్మాస్యవ్రతం ఆచరించిన సాధకులు కార్తీకశుద్ధ ద్వాదశిరోజు వ్రతసమాప్తి చేయడం ఆచారంగా వస్తోంది.

ఈ ద్వాదశిరోజు దీపదానం చేయాలి ----------

**ఒక దీపాన్ని దానం చేస్తే " ఉపపాతకములు "నశిస్తాయి ,**

**పది దీపాల్ని దానం చేస్తే " మహా పాతకాలు" నశిస్తాయి ,**

**వంద దీపాలు దానం చేస్తే " శివ సాన్నిధ్యం" లభిస్తుంది ,**

**వంద కి పై గా దానం చేస్తే " స్వర్గాదిపత్యం" లభిస్తుంది ,**

ఈ రోజు దీప దర్శనం లభిస్తేనే ఆయుర్దాయం , బుద్ధిబలం , ధైర్యం , సంపద , కలుగుతాయి . ఈ రోజు స్నానసంధ్యలు చేశాక , కల్పోక్త ప్రకారం నానావిధ వేదమంత్రాల తో గాని , పురుష సూక్తం చేత గాని శ్రద్ధ గా మహావిష్ణువును అర్చించాలి . మొదట పంచామృత స్నానం గావించి , ఆ తర్వాత శుద్ధోదకముల తో అభిషేకం చేసి శ్రీమహావిష్ణువును స్వర్ణం తో , వస్త్రాలతో అలంకరించి , నా నావిధములైన పుష్పాల తో , ధూపదీపాల తో పూజించి , నైవేద్యం పెట్టి ,దక్షినతాంబులాదులను సమర్పిస్తే .. వారి సకలపాపాలు పోయి , సమస్త సంపదలు సమకూరుతాయి .

ఈ కార్తిక శుద్ధ ద్వాదశి రోజు తులసి పూజ , విష్ణువు తో తులసీ కల్యాణం చేస్తారు . కార్తీక శుద్ధ ద్వాదశి రోజునే శ్రీమహావిశ్ను లక్ష్మీ సమేతం గా బ్రహ్మ , ఇంద్రాది దేవతల తో కలసి బృందావనానికి వెళ్ళారు అంటారు ... అందుకే ఈ రోజుని " బృందావని ద్వాదశి" అని కుడా అంటారు .

## " బృంద ద్వాదశి " గురించి న ఓ పురాణ కధ ఉంది :



పూర్వము 'కాలనేమి ' అనే రాక్షసుడికి గుణవతి అయిన ఒక కుమార్తె ఉండేది . ఆమె పేరు "బృంద" . కుమార్తెను "జలంధరుడు " అనే మరో రాక్షసుడు కిచ్చి వివ్వాహము చేసారు . కొంత కాలానికి జలంధరుడు దేవతుల పై యుద్ధానికి వెళ్ళాడు . దేవతలు అతన్ని జయించలేకపోయారు . అందుకు కారణం పతివ్రత అయిన బృంద యేనని గ్రహిస్తారు . ఆ విషయం విష్ణువు కి తెలియజేస్తారు .

బృంద పాతివ్రత్యం చెడి పోతే గాని జలంధురుని జయించడం కష్టమని గ్రహించిన విష్ణు ... జలంధురుని రూపం లో బృంద దగ్గరికి వెళ్తాడు , వచ్చింది భార్తేనని భ్రమపడిన బృంద అప్పటిదాకా చేస్తున్న ధ్యానాన్ని వదిలేస్తుంది . దాంతో జలన్దురుడు ఇంద్రుని చేతిలో మరణిస్తాడు . అది తెలిసి బృంద కోపం తో విష్ణువును శిలవు(రాయి) కమ్మని శపిస్తుంది . విష్ణువు తన భక్తురాలైన బ్రిందను అనుగ్రహించి ఆమె తులసి చెట్టు గా అవతరించి అన్ని లోకాల వారిచేత పూజలన్దుకుంటుందని వరమిచ్చి మోక్షం ప్రసాదిస్తాడు . ఆ విధం గా బృంద తులసి చెట్టు గా పూజలందుకొంటుంది .

## చిలుకు ద్వాదశి – తులసి పూజ :

దేవుడు ఏ తప్పు చేసిన అది సమాజ శ్రేయస్సు కొరకే అని భావించే మన భారత సంస్కృతి లో తప్పులు చేసిన రోజులు కూడా పవిత్రదినాలే . . . పండగలే . కార్తీక శుద్ధ ద్వాదశిని చిలుకు ద్వాదశి అనీ వ్యవహరిస్తారు. గృహిణులు నేడు క్షీరాబ్ధిశయన వ్రతాన్ని ఆచరిస్తారు. శ్రీ మహావిష్ణువు ద్వాదశిరోజు "తులసి బృందావనానికి"

వస్తాడని ప్రతీతి. క్షీరాబ్ధిశయన వ్రతంలో తులసినీ, విష్ణువునూ పూజించి దీపారాధన చేస్తారు. సూర్యాస్తమయం అనంతరం స్త్రీలు తులసి బృందం పై శ్రీవిష్ణువు పటాన్నిగానీ, విగ్రహాన్నిగానీ ఉంచి ఆచరించే వ్రతం వల్ల ఐదోతనం ప్రాప్తించి సుఖసంపదలు కలుగుతాయని విశ్వసిస్తారు.

భారతీయ సంప్రదాయంలో తులసికి అధికప్రాధాన్యముంది. దేవతార్చనకు తులసి దళం అతిశ్రేష్ఠం. తులసి మొక్క శ్రీమహావిష్ణువుకు ప్రీతికరమైంది. నువ్వుల్లో నూనెలాగా, పెరుగులో వెన్నలా, ప్రవాహంలో నీటిలాగా, ఇంధనంలో అగ్నిలాగా శ్రీమహావిష్ణువు తులసి మొక్కలో నిగూఢంగా ఉంటాడని బ్రహ్మోపనిషత్తు తెలుపుతోంది. తులసి సాక్షాత్తు లక్ష్మీదేవి అవతారం. చిలుకు ద్వాదశి రోజు తులసికోట వద్ద కర్ర పాతి ఆకాశదీపం వెలిగించాలని శాస్త్రం తెలుపుతోంది. కార్తీక శుద్ధ ద్వాదశి శివునికి ఇష్టమైన సోమవారం ఉత్తరాభాద్ర నక్షత్రంతోనైనా, శనివారం రేవతి నక్షత్రంతోనైనా కలిసిరావడం మంచిదని అంటారు. సోమవారం ఉత్తరాభాద్రతో వచ్చిన కార్తీక ద్వాదశిని హరవాసరమనీ, శనివారం రేవతీ నక్షత్రయుక్తమైతే హరివాసరమని అంటారు. ఈ సంవత్సరం కార్తీక శుద్ధ ద్వాదశి హరవాసరమైరావడం శుభసూచకమని కృత్యసారస సంహితం తెలుపుతోంది. చాతుర్మాస్యవ్రతం ఆచరించిన సాధకులు కార్తీకశుద్ధ ద్వాదశిరోజు వ్రతసమాప్తి చేయడం ఆచారంగా వస్తోంది.

పారమార్థికంగానే కాక, మనిషి విధి విధానాల్లోనూ తులసికి మహత్తు ఉన్నదని భావిస్తారు. ఆరోగ్యదృష్ట్యా తులసి అత్యంత హితమైంది. ఈ మొక్క అతిపెద్దమానుగా ఎదగదు. మూడడుగులు ఎదిగే చిన్న పొద . పరిమళాలను వెదజల్లే ఈ మొక్కను ప్రతి గృహంలో పెంచడం వల్ల దుర్గంధాలు తొలగి దోమలతో పాటు క్రిమికీటకాలు నశిస్తాయి. తులసి ఆకులు, గింజలు, వేళ్లు, కొమ్మలు వైద్యపరంగా ఉపయుక్తమైనవే! రెండుకన్నా ఎక్కువ ఆకులు చేరివున్నవాటిని తులసి దళాలు అంటారు. వాటిని నీటిలో ఉంచి తీర్థంగానైనా, నేరుగానైనా వినియోగిస్తే– శరీరంలోని జలుబుకారక రుగ్మతలు తొలగి చర్మసౌందర్యం ఇనుమడిస్తుంది. వివిధ సాంక్రామిక వ్యాధులను తులసి వినియోగంతో నివారించవచ్చు. తులసి మొక్క నుంచి వచ్చే తావివల్ల పరిసరాలు శుభ్రంగా మారతాయి. అందుకే తులసి మొక్కను పవిత్రమైందిగా పరిగణిస్తారు. భారతీయ సంస్కృతిలో ప్రతి ఇంట్లోనూ తులసికోట నిర్మించడం ఆచారంగా వస్తోంది. చిలుక ద్వాదశిరోజు తులసిని దేవతగా భావించి పూజిస్తారు. స్మృతికౌస్తుభం ప్రకారం– కార్తీక శుద్ధ ద్వాదశి మొదలు, పౌర్ణమి వరకు తులసి కల్యాణం జరపాలని చెబుతారు. దశావతారాల్లోని శ్రీకృష్ణావతారంలో తులసికీ శ్రీకృష్ణునికీ కార్తీక ద్వాదశినాడు వివాహం జరిగిందని పురాణ కథనం. తులసి కల్యాణానికి దేవ దీపావళి అనీ పేరు. దీపావళినాటిలాగా కార్తీక శుద్ధ ద్వాదశినాడు ఇంటినిండా దీపాలు ప్రమిదల్లో వెలిగిస్తారు. శ్రీకృష్ణుడు సర్వదా తన సొత్తుగా భావిస్తూ గర్వపడిన సత్యభామతో నారదుడు ఆచరింపజేసిన వ్రతం తెలిసిందే. తులసి దళాల బరువుకు మాత్రమే శ్రీకృష్ణుడు తూగి సత్యభామకు గర్వభంగం కలిగిన రసవత్తరమైన కథ మరిచిపోలేనిది. కార్తీకశుద్ధ ద్వాదశిరోజు ఉసిరికాయలతో కూడిన కొమ్మను తులసితో కలిపి పూజించి దీపారాధన చేయడం మన రాష్ట్రంలో ఆచారంగా వస్తోంది.

దేవ దేవుళ్ళ కథలు, కథనాలు ఒక్కొక్క పురాణము లో ఒక్కో విధము గా ఉన్ననూ వాటి సరాంశము విదివిధానాలు ఒక్కటే .

## కార్తీకపౌర్ణమి

పండుగలు మన సంస్కృతి, సాంప్రదాయాలను తెలియజేస్తాయి, విశదీకరిస్తాయి, నిలువరింపజేస్తాయి. భారతీయ ఆధ్యాత్మికాచారాలలో పండుగలకున్న ప్రాధాన్యత ప్రత్యేకమైనది. పండుగను అభిమానించని భారతీయుడు ఉండడు. ప్రత్యేకంగా పండుగను చేసుకోని నాస్తికులు సైతం పండుగ దినాలను మాత్రం ఖచ్చితంగా సంతోషంగా అనుభవించే తీరతారు. అది పూజతో నిమిత్తం లేనిది. సంతోష ఉత్సాహాలకు నిలయమైనది. కాబట్టే పండుగ అనే భావన ఎటువంటివారిలోనైనా అలౌకికానందాన్ని పంచుతుంది. ఒక్కో పండుగ ఒక్కో ప్రత్యేకమైన శోభను చేకూరుస్తూ మానసికోల్లసాన్నిస్తూ గృహాలకు కొత్త అందాలను ఇస్తుంది. అందుకే చిన్నా, పెద్దా అందరూ వీటికోసం ఎంతో ఆర్తిగా ఎదురుచూస్తుంటారు. పండుగల సంబరాలు చిన్న పిల్లలవే అయినప్పటికీ ఆ ముచ్చట్లను పెద్దలు కూడా ఎంతో సంతోషంగా అనుభవిస్తారు.

ఈ తరం యువత పండుగలు, పర్వదినాలు, ఒక వేడుక జరుపుకోవడానికే పరిమితం జేస్తున్నారు . పండుగల ద్వారా మన పురాణ ఇతిహాసాలు,మనకు అందించే సంస్కృతి సాంప్రదాయాలను నేటి తరానికి తెలియజేయాలని ప్రతి పర్వదినానికి తగిన రీతిగా వాటి విశిష్టతను గురించి ప్రజలకు ,విద్యార్థులకు తెలియజేయాలని విజ్ఞప్తి చేయుచున్నారు .

కార్తీకమాసం అంతా స్నాన, దాన, జప, ఉపవాసాలు చేస్తే మంచిదని ధర్మశాస్త్రగ్రంథాలు చెబుతున్నాయి. అలా చేయడం కుదరనివారు ఏకాదశి, ద్వాదశి, చతుర్దశి, పౌర్ణమి రోజుల్లో ఈ నాలుగింటిలో ఏదో ఒకదాన్ని ఆచరించినా సరిపోతుందనీ... అందుకు కూడా శక్తిలేనివారు పౌర్ణమినాడు శివాలయంలో దీపం వెలిగించినా పౌండరీకయజ్ఞం చేసినంత ఫలం లభిస్తుందనీ ప్రతీతి. అదే కార్తీకపౌర్ణమి ప్రాశస్త్యం.



పౌర్ణమి... ప్రతి నెలా వస్తుంది. కానీ చంద్రుడు కృత్తికా నక్షత్రంతో కలిసి ఉండే కార్తీక పౌర్ణమికి ఉండే ప్రత్యేకత మరే పున్నమికీ ఉండదు. ఖగోళపరంగా చూస్తే... ఏడాది మొత్తమ్మీదా జాబిలి ఆ రోజు ఉన్నంత ప్రకాశంగా మరేరోజూ ఉండదు. అంతలా వెలిగిపోయే వెన్నెలకే కన్నుకుట్టేలా గుడిప్రాంగణాలూ జలాశయాలూ కార్తీకదీపాలతో శోభాయమానంగా వెలిగిపోతుంటాయా రోజు.

కార్తీకపౌర్ణమినాడు వేకువజామునే లేచి శివనామస్మరణతో తలారా స్నానం చేసి భక్తిశ్రద్ధలతో దీపారాధన చేసి వాటిని అరటిదొప్పల్లో పెట్టి చెరువులు, నదుల్లో వదులుతుంటారు మహిళలు. పెళ్లికాని అమ్మాయిలు కార్తీకదీపాలను నదుల్లో వదిలి రాత్రికి తులసికోటలో ఉసిరికొమ్మ(కాయలతో)పెట్టి తులసి పక్కన రాధాకృష్ణుల విగ్రహాన్ని ఉంచి పూజిస్తే కోరుకున్న వ్యక్తి భర్తగా వస్తాడని విశ్వసిస్తారు.

ముఖ్యంగా కార్తీకపౌర్ణమి రోజున ముత్తైదువులు రెండురకాల నోములు నోచుకుంటారు. ఒకటి కార్తీక చలిమిళ్ల నోము. ఈ నోము కోసం కార్తీకపౌర్ణమినాడు చలిమిడి చేసి మొదటి సంవత్సరం ఐదుగురు ముత్తైదువులకు ఆపై సంవత్సరం పదిమందికి మూడో ఏడాది పదిహేనుమందికీ చొప్పున వాయినాలిస్తారు. రెండోది కృత్తికాదీపాల నోము. ఆరోజు రాత్రికి శివాలయంలో 120 దీపాలను వెలిగిస్తారు. తరవాతి సంవత్సరం 240 దీపాలు, ఆ పై

సంవత్సరం 360 దీపాలు శివాలయంలి ో వెలిగిస్తారు. ఈ నోములు నోచుకుంటే శివసాన్నిధ్యం లభిస్తుందని పురాణ కథనం. ఇంకా... కార్తీకపౌర్ణమినాడు నమకచమక మహాన్యాస పూర్వక ఏకాదశ రుద్రాభిషేకం చేస్తే శివుడు ప్రసన్నుడౌతాడని పురాణాలు చెబుతున్నాయి. ఆరోజున ఉసిరికాయ దానం చేస్తే దారిద్ర్యం తొలగిపోతుందట. లలితాసహస్రనామం భక్తిగా పఠిస్తే ఆ దేవి సకల ఐశ్వర్యాలనూ అందిస్తుందట.

దీపం అంటే అగ్ని. జ్ఞానానికీ ఆనందానికీ సిరిసంపదలకూ ప్రతీక. దీపకాంతిలో ఉండే ఎరుపు, పసుపు, నీలి కాంతులు ముగురమ్మలకూ సంకేతం అని నమ్మిక. దీపారాధన వల్ల శివుని అనుగ్రహం కలుగుతుందని పురాణ ప్రతీతి. వెలిగించేవాళ్లకి సహాయకులుగా ఉన్నా... కొడిగట్టబోతున్న దీపానికి నూనె పోసినా కూడా ఆ పుణ్యఫలం దక్కుతుందని భక్తుల ప్రగాఢవిశ్వాసం. అలాగే ఈరోజున... కంచుపాత్రలో ఆవునెయ్యి పోసి దీపం వెలిగిస్తే పూర్వజన్మలో చేసిన పాపాలు నశిస్తాయని కార్తీకపురాణం చెబుతోంది.
పురాణ ప్రశస్తి...

కార్తీకపౌర్ణమినే త్రిపురిపూర్ణిమ అనీ దేవ దీపావళి అని కూడా వ్యవహరించడం కద్దు. ఆ కథావిశేషమేంటంటే... పూర్వం త్రిపురాసురుడనే రాక్షసుడు అంతరిక్షంలో మూడుపురాలను నిర్మించుకుని సర్వసుఖాలూ అనుభవించేవాడట. బలగర్వంతో దేవతలందరినీ హింసించేవాడట. అప్పుడు శివుడు త్రిపురాసురునితో మూడురోజుల పాటు యుద్ధం చేసి అతణ్ని సంహరించాడట. అసురవధ జరిగిన ఆనందంలో దేవతలంతా దీపాలు వెలిగించి పండగ జరుపుకున్నారట. అందుకే దీన్ని 'దేవ దీపావళి' అని కూడా అంటారు. ఇంకా విష్ణుమూర్తి మత్స్యావతారంలో పుట్టినదీ ఈరోజే. బృందాదేవి తులసిమొక్కగా అవతరించిందీ, కార్తికేయుడు పుట్టిందీ, దత్తాత్రేయుడి జన్మదినమూ రాధాకృష్ణులకెంతో ఇష్టమైనదీ... ఈ రోజే. అలనాడు ద్వాపరయుగంలో రాసలీలా మహోత్సవంలో గోపికాస్త్రీలను ఆ నల్లనయ్య అనుగ్రహించింది ఈ రోజేనని నమ్మిక. క్షీరసాగరమథనంలో వెలువడిన హాలాహలాన్ని తన గళాన దాచుకున్న శివుడి చుట్టూ పార్వతీదేవి ప్రదక్షిణ చేసిన ఘట్టాన్ని గుర్తుచేసుకుంటూ ఈరోజున శివాలయాల్లో ఒక ఉత్సవాన్ని నిర్వహిస్తారు. ఎండుగడ్డిని తాడుగా పేని తోరణంగా కట్టి దాన్ని వెలిగించి భగభగ మండే ఆ తోరణం చుట్టూ పార్వతీదేవి విగ్రహాన్ని ముమ్మారు తిప్పుతారు. దీనికే 'జ్వాలా తోరణోత్సవం' అని పేరు.



ఇలా ఎన్నో రకాలుగా పౌరాణిక ప్రాశస్త్యం ఉంది కాబట్టే కార్తీకపౌర్ణమినాడు శివాలయాల్లో రాత్రంతా దీపాలు వెలిగిస్తారు. వాటినే దీపమాలలుగా పిలుస్తారు. గుడిప్రాంగణాల్లో మెట్లన్నీ దీపాల అమరికతో శోభాయమానంగా కనిపిస్తాయి. ఇక... ఇలపై శివుని ఆవాసంగా భావించే మహాపుణ్యక్షేత్రం వారణాసిలో గంగానది తీరంలోని ఘాట్‌లన్నీ కార్తీక పున్నమినాడు దీపకాంతులతో ప్రకాశిస్తాయి. ఇవి ఆ రాత్రంతా వెలుగుతూనే ఉంటాయి. ఈ కార్యక్రమాన్ని కార్తీక దీపార్తన అంటారు స్థానికులు. ఆరోజు పుష్కర్‌తోపాటు గంగానదిలో స్నానంచేస్తే ముక్తిని పొందుతారన్నది మరో నమ్మకం.

తులసి పూజ – తులసి ప్రాశస్త్యమ్

**శ్లో|| యన్మూలే సర్వతీర్థాని యన్మధ్యే సర్వదేవతా**

**య దగ్రే సర్వవేదశ్చ తులసీం త్వా నమామ్యహమ్ ||**

శ్రీ మహాలక్ష్మీ నారాయణ స్వరూపిణియైన "తులసి" యొక్క మూలంలో సర్వతీర్థాలు, మధ్యభాగమందు సమస్త దేవతలు, తులసిమొక్క పైభాగమున సర్వవేదాలతో కొలువైవున్న తులసి మాతకు ముందుగా నమస్కరించుకుని, అంతటి పూజ్యనీయమైన ఆ తులసి ఆవిర్భావ చరిత్ర–తులసి ప్రాశస్త్యమును గూర్చి, మన పురాణములలో ఎన్నో కథలు కానవస్తున్నాయి. వాటిలో ఒకగాథను సమీక్షించుకుందాం!

"బ్రహ్మవైవర్తపురాణ"మందు గల తులసి వృత్తాంతము ఇలా ఉన్నది. ధర్మధ్వజుడు, మాధవి అను దంపతులకు అతిలోక సౌందర్యవతియైన కుమార్తె కలిగినది. వారు ఆ బిడ్డకు "బృంద" అను నామకరణము చేసుకుని అల్లారు ముద్దుగా పెంచుకోసాగిరి. ఆమెకు వివాహవయస్సురాగనే శ్రీహరిని వివాహమాడతలచి బదరికాశ్రమము జేరి బ్రహ్మనుగూర్చి ఘోరముగ తపమాచరించినది. బ్రహ్మదర్శన మిచ్చి నీ కోరిక ఏమిటో చెప్పుమనగా "నేను రాధాశాపముతో నున్న రుక్మిణిని, నాకు శ్రీకృష్ణుడే భర్తగా పొందుటకు"– వరమీయమని ప్రార్థించినది.



అందులకు బ్రహ్మ ! నీ కోరిక తప్పక నెరవేరగలదు. కాని! ముందుగా గోలోకనివాసి సుదాముడే ముందుగా నీకుభర్త కాగలడు, అనంతరమే నీవు కోరిన వాడే నీకు పతియగును అని వరమిచ్చి అంతర్ధానమయ్యెను.

ఇలా ఉండగా బ్రహ్మదేవుడు చెప్పిన సుదాముడు పుష్కరకాలము శాపకారణముగా భూలోకమున శంఖచూడుడై జన్మించి తపమాచరించసాగెను. అతని తపస్సునకు మెచ్చి బ్రహ్మ ఏమివరము కావాలో కోరుకోమన్నాడు. అంత శంఖ చూడుచు "లక్ష్మీభూలోకమున పుట్టినదట! నాకామెతో వివాహము చేయించమని వేడుకొనెను" బ్రహ్మ 'తథాస్తు' అని పలికి ఆమె బదరికాశ్రమమున నున్నది. ఆమె నీకు తప్పక లభ్యముకాగలదు అని యంతర్థానమందెను. అనంతరము శంఖ చూడుడు బృందవాద ప్రతి వాదములను గమనించి అప్పుడు వార్కి మరల బ్రహ్మ ప్రత్యక్షమై వారి వారి అభీష్టములు నెరవేరుటకు వార్కి వైభవముగా వివాహము గావించెను.

ఇక శంఖచూడునకు లక్ష్మీయంశతో నున్న భార్య లభ్యమగుసరికి! అష్టైశ్వర్యము లతో తులతూగుచూ అతిసమయము పెంచుకుని స్వర్గాధిపత్యము పొందగోరి దేవరాజ్యమును కొల్లగొట్టి; దేవతలను పలు ఇక్కట్లు పాలు చేయుటయే కాకుండా; పరమేశ్వరుని చెంతకేగి, శివా! నీ భార్య సుందరాంగి. అమెను నాకు వశ్యురాలును చేయుము లేనిచో యుద్ధమునకు తలపడమని ఘోరముగా శివునితో యుద్ధము చేయసాగెను. వెంటనే శ్రీహరి వారిని

సమీపించి "శివా! వీడు అజేయుడు అగుటకు కారణం! ఈతని భార్య మహాపతివ్రత. ఆమె పాతివ్రత్య భంగము నేనాచరించదను. నీవు వీనిని వధించుము." యని యుక్తి చెప్పెను.

అనంతరము మాయా శంఖచూడుని వేషము ధరించి యున్న శ్రీహరిని చూచి బృంద తన భర్తే వచ్చినాడని భ్రమించి! ఆతనికి సర్వోపచారములుచేసి శ్రీహరి చెంతకు చేరగానే! ఆమె పాతివ్రత్యము భగ్నమగుట గ్రహించి శివుడు శంఖచూడుని సంహరించగా! నాతడు దేహమును విడచి "సుదాముడై" గోలోకమునకు పోయెను. బృంద తన ఎదుట ఉన్నది మాయా శంఖచూడుడని గ్రహించి శ్రీహరిని "శిలారూప మందుదువుగాక" యని శపించగా! తిరిగి ఆమెను నీవు "వృక్షమగుదువుగాక" యని శపించెను. ఆవిధంగా శ్రీహరి గండకీనదిలో సాలగ్రామ శిలగాపుట్టి; బృంద తులసీ వృక్షమై పోయి ఇద్దరూ ప్రపంచముచే పూజనీయస్వరూపములు పొందినట్లుగా బ్రహ్మవైవర్త పురాణగాధ ద్వార విదతమగుచున్నది.

ఒకసారి పరమేశ్వరుడు కుమారుడైన కుమారస్వామిని చెంతకుం చేర్చుకుని; పుత్రా!
"పుత్రా! సకల వృక్షములలోన తులసియొక్కటయే
పూజ్యమైక క్ష్మారుహంబు దాని పత్రములను దాని
పుష్పములను బ్రాణ సమములగును అచ్యుతనకు."



మరియు వృక్షాలన్నిటియందు తులసి శ్రేష్ఠమైనది, శ్రీహరికి ఇది అత్యంత ప్రీతిపాత్రమైనది. "తులసిపూజ" తులసీ స్తోత్రం చదవడం, తులసి మొక్కలో పోసిన నీటిని శిరస్సున జల్లుకోవడం, తులసీవనమును పెంచి వాటి మాలలు శ్రీహరికి సమర్పించుట ఎంతో! పుణ్యప్రదమైనవి. గోదాదేవి తులసీవనంలోనే అయోనిజగా విష్ణుచిత్తునింట వెలసి శ్రీరంగనాధుని ఇల్లాలయింది.

**శ్లో|| వశిష్ఠాది మునిస్తోమై: పూజితో తులసీవనే**
**తదా ప్రభృతి యద్విష్ణు : బ్రతిజ్ఞాం కృతవాన్ ప్రభు:**
**తస్మిన్ తులస్యాంతు య: పూజాంకురు తేనర:**
**సర్వపాప వినిర్ముక్త : మమసాయుజ్య మాప్నుయాత్.**

వశిష్ఠాది మునిగణముచే ఎన్నో విధములుగా స్తోత్రపూర్వకముగా శ్రీహరి తులసీ వనమందు పూజలందుకొని నన్ను "కార్తీక శుద్ధద్వాదశి" నాడు విశేషించి ఎవరు బూజచేయుదురో! అట్టివారి సమస్తయొక్క పాపములు అగ్నిలోపడిన మిడుతలు వలె భస్మమయి వారు తప్పక నా సాన్నిధ్యమును పొందుదురని ప్రతిజ్ఞ చేసెనట!

**శ్లో|| తులసీవ్రత మహాత్మ్యం శ్రోతవ్యం పుణ్యవాంఛ్చిన:**

**యదిచ్ఛేద్విష్ణు సాయుజ్యం శ్రోతవ్యం బ్రాహ్మణైస్సహ**

**విష్ణో : ప్రీతిశ్చ కర్తవ్యా శ్రోత వ్యాతులసీకధా**

**ద్వాదశ్యాం శ్రవణాత్తస్యా: పునర్జన్మ న విద్యతే.**

విష్ణు సాన్నిధ్యముగోరి విష్ణుదేవునకు యేమాత్రమైన ప్రీతి జేయవలయునునని తలచేవారు తులసీ వ్రతమహాత్మ్యము తప్పక వినవలయును. అందునా! ఆ వ్రత కధను "క్షీరాబ్ధిద్వాదశి" రోజున తులసీ కధ వినువార్కి, చదువువార్కి, పూర్వజన్మ కృతమైన దు:ఖములన్నియు తొలగిపోయి విష్ణులోకమును పోందుదురు, అని శంకరునిచే "తులసి" కొనియాడబడినట్లు చెప్పబడినది. అట్టి తులసీ బృందావన మందు ఉసిరిమొక్కతో కలిపి "తులసీధాత్రీ సమేత శ్రీమన్నారాయణుని" ఈ కార్తీక ద్వాదశినాడు పూజించుట ఎంతో విశిష్టమైనదిగా పేర్కొనబడినది. మరియు అట్టి తులసీ దళములకు "నిర్మాల్యదోషం" పూజలో ఉండదని కూడా చెప్పబడినది.

కావున! మన హిందూమతంలో "తులసి" ఆధ్యాత్మిక దృష్టిలో విశిష్టమైన స్థానాన్ని పొందింది. తులసిమొక్క హిందువులకు పూజనీయమైనది. కావున హిందువులు ప్రతిఇంటా తులసి మొక్కను కోటలో పెంచి పూజించుట మనం చూస్తూ ఉంటాము. ఇక పట్టణావాసులైతే అంతలో కొంత జాగా ఏర్పరచుకుని, చిన్నచిన్న కుండీల్లోనో, డబ్బాల్లోనో పెంచి పూజిస్తూ ఉంటారు. కావున 'తులసి' ఉన్న ఇల్లు నిత్యకళ్యాణము పచ్చతోరణంతో శోభిల్లుతూ ఉంటుంది.



ఇక ఈ తులసిని వైద్యపరంగా కూడా చూస్తే! ఆయుర్వేద శాస్త్రంలో 'సప్తతులసి-భరతవాసి' అంటూ తులసిని ఏడువిధాలుగా వివరించబడినది. అవి: 1.కృష్ణ తులసి 2. లక్ష్మీతులసి 3.రామతులసి 4. నేల తులసి 5. అడవి తులసి 6. మరువ తులసి 7.రుద్రతులసిగా వివరుస్తారు. వైద్యపరంగా వాటి అన్నిటికి ఎన్నో అమోఘమైన ఔషధగుణాలతో కూడి ఉంటాయని ఆయుర్వేద శాస్త్రం కొనియాడుతోంది. ప్రతిరోజు ఉదయం రెండు తులసి ఆకులు (కోటలోవికాదు) విడిగా పెంచుకున్న మొక్కలనుండి నమలి మింగితే వార్కి బుద్ధిశక్తి, జ్ఞాపకశక్తి పెరుగుతుంది. మరియు అనేక మానసిక రుగ్మతలు నయమవుతాయని; ఇలా ఎన్నో విశేష గుణాలను చెప్తారు.ఇక దాని కాండముతో తయారుచేయబడ (తులసిమాల)కు ఇటు ఆధ్యాతికపరంగా అటు ఆరోగ్యపరంగా ఎన్నోలాభాలు ఉన్నాయిట !

కావున ఈ "క్షీరాబ్దిద్వాదశి" వ్రతాన్ని ఆచరించి ఇటు ఆధ్యాత్మిక సంపదతో పాటు ఆరోగ్య భాగాన్ని సర్వులమూ పొందుదాం!

తులసీ పూజతో సర్వదేవతారాధన

ప్రతి మనిషికీ తల్లి తొలిగురువు అని పెద్దలంటారు. ఆ తల్లిని గురువుగా భావించి, గురుదక్షిణ ఇవ్వడం కొద్ది మందికే సాధ్యం. అటువంటి అసాధారణ వ్యక్తులలో సంగీత త్రయంలోని త్యాగరాజును చెప్పుకోవాలి. సంగీత కుటుంబం నుండి వచ్చిన తల్లి సీతమ్మ సంగీతంలోని ఓనమాలు నేర్పి త్యాగరాజు తొలిగురువయింది.

ప్రతి నిత్యం తులసి కోటకు ప్రదక్షిణలు చేస్తూ, మధురమైన కంఠంతో పురందరదాసు, రామదాసు, అన్నమయ్యల కీర్తనలు తల్లి పాడుతుంటే వింటూ, గొంతు కలిపి పాడుతూ త్యాగరాజు పెరిగాడు. వంశానుగతంగా వచ్చిన శ్రీరామభక్తి, తల్లి సంకీర్తనల ద్వారా మరింత పరిపుష్టమై, త్యాగరాజును అచిరకాలంలోనే గొప్ప సంగీతజ్ఞుడిగా, వాగ్గేయకారుడిగా తీర్చిదిద్దింది.

తన బంగారు భవితవ్యానికి మార్గదర్శకురాలైన తల్లికి గురుదక్షిణ సమర్పించడమే తన ప్రథమ కర్తవ్యమని త్యాగరాజు భావించాడు. తల్లికి అత్యంత ప్రియమైన తులసీమాతపై కీర్తనలు రచించి తద్వారా ఆమెకు సంతృప్తి కలిగించాడు. ఎన్నో ఔషధగుణాలు కలిగి, సౌభాగ్యప్రదాయినిగా ప్రతియింటా వెలసిన తులసీమాతపై త్యాగరాజు రచించిన కీర్తనలు ఎంతో ప్రసిద్ధి పొందాయి.



సావేరి రాగం – రూపకతాళం

ప॥తులసీ జగజ్జననీ దురితాపహారిణీ॥

చ॥చరణ యుగంబులు నదులకు పరమ వైకుంఠమట

సరసిజాక్షి నీమధ్యము సకల సురావాసమట

శిరమున నైగమకోట్లు చెలగుచున్నారట

సరస త్యాగరాజాది వర భక్తులు పాడేరట॥

తులసి మొక్క అడుగుభాగాన శ్రీ మహావిష్ణువు సాలగ్రామ రూపంలో ఉంటాడు. విష్ణుపాదాల నుండే గంగ పుట్టడం వల్ల, నదులకు పుట్టిల్లు వైకుంఠమనీ, విష్ణు నివాసమైన తులసియే వైకుంఠమని, మధ్య భాగంలో సకల దేవతలు కొలువుంటారనీ, శిరోభాగం వేద స్వరూపంగా భాసించడం వల్ల, ఒక్క తులసి మాతను పూజిస్తే సకల దేవతలనూ పూజించినట్లే అని త్యాగరాజు తులసీ మహాత్మ్యాన్ని తెలియపరిచాడు.

**"దైవజ్ఞరత్న","జ్యోతిర్వాస్తురత్న" శ్రీమాన్ గొడవర్తి సంపత్కుమార్ అప్పలాచార్యులు.**

**M.Tech (CSE), M.A.(జ్యోతిషం),MISTE,MCSI,MIACSIT.MIAENG**

# కార్తీక మాసంలో ప్రతినిత్యం ఆచరించవలసిన విధులు

## కార్తీకమాసం 30 రోజులు చేయవలసిన విధులు

**1 వ రోజు శుద్ధ పాడ్యమి | చదువవలసిన అధ్యాయము-1 | పేజినెం-9**

స్నానంచేసి శివాలయానికిగాని,విష్ణాలయానికిగానివెళ్ళి స్వామిదర్శనం చేసుకుని కార్తీకవ్రత సంకల్పాన్నినివేధించి విజయాన్ని అభ్యర్థించాలి. సాయంత్రం దీపారాధనచేసి ఆకాశదీపాన్ని దర్శించాలి. ఈ రోజు బంగారం,నెయ్యిదానం ఇవ్వాలి.

**2 వ రోజు విదియ | చదువవలసిన అధ్యాయము-2 | పేజి నెం-11**

తోబుట్టువు ఇంటికివెళ్ళి ఆమెచేతి భోజనంచేసి ఆమెకు కానుకలు ఇవ్వవలెను. తోబుట్టువు లేకున్న ఆ వరసైన వారింటికివెళ్ళవలెను. తరిగిన వస్తువులు తినరాదు. ఈ రోజు తామరపువ్వు, ఉప్పు,నూనె దానమివ్వాలి.

**3 వ రోజు తదియ | చదువవలసిన అధ్యాయము-3 | పేజీనెం-13**

త్రిలోచన గౌరీవ్రతం ఆచరించవలెను. వ్రతంచేయనివారు పార్వతీదేవికి కుంకుమార్చన చేయుట మంచిది. పులుపు తినరాదు. ఈ రోజు ఉప్పుదానమివ్వాలి.

**4 వ రోజు చవితి | చదువవలసిన అధ్యాయము-4 | పేజీనెం-15**

ఈరోజునపుట్టవద్దకువెళ్ళిసుబ్రహ్మణ్యస్వామినిఆరాధించాలిలేదాఆలయంలోపూజ జరిపంచుటమంచిది.వంకాయ,ఉసిరి,తినరాదు.ఈరోజుపెసరపప్పు,నువ్వులు దానమివ్వాలి.

**5 వ రోజు పంచమి | చదువవలసిన అధ్యాయము-5 | పేజి నెం-17**

ఈరోజును జ్ఞాన పంచమి అంటారు. సుబ్రహ్మణ్యస్వామిపూజ జరిపించవలెను. పులుపుతినరాదు ఈరోజు విసనకర్ర,స్వయంపాకంతోబ్రాహ్మణునకు దానమివ్వాలి

**6 వ రోజు షష్ఠి | చదువవలసిన అధ్యాయము-6 | పేజినెం-20**

ప్రీతిపదార్ధములు, ఉసిరి తినరాదు. ఈరోజు నువ్వులు, బెల్లంతో చేసిన చిమిలి బ్రహ్మచారికి ఎర్రగళ్ళ తువాలు దానం ఇవ్వాలి.

**7 వ రోజు సప్తమి | చదువవలసిన అధ్యాయము-7 | పేజినెం-21**

ఎర్రగుడ్డలో గోధుమలుపోసి దానమివ్వవలెను. పంటితో నమిలితినే పదార్ధములు తినరాదు. ఈరోజుగోధుమలు,పట్టువస్త్రం, బంగారం దానంమివ్వాలి.

**8 వ రోజు అష్టమి | చదువవలసిన అధ్యాయము-8 | పేజినెం-23**

ఈరోజుగోపాలాష్టమి, ఈరోజు గోపూజచెయ్యవలెను. గోధానము మంచిది. ఉల్లి,ఉసిరి తినరాదు. ఈ రోజు స్వయంపాకంతో వస్త్రదానం చెయ్యాలి.

**9 వ రోజు నవమి | చదువవలసిన అధ్యాయము-9 | పేజినెం-26**

ఈరోజునుండి మూడుదినాలు శ్రీ మహావిష్ణుత్రిరాత్రవ్రతం చెయ్యవలెను.సాయంకాలం దామోదరుని పూజించుట, రాత్రివిష్ణువును పూజించుటమంచిది. నూనె సరుకులు,పులుపు,ఉసిరితినరాదు. ఈ రోజు మీ పితృదేవతలకు ప్రీతికరమైనవి దానంచెయ్యాలి.

# కార్తీకమాసం 30 రోజులు చేయవలసిన విధులు

**10 వ రోజు దశమి** | చదువవలసిన అధ్యాయము-10 | పేజీనెం-27

ఈరాత్రి విష్ణుపూజ చెయ్యవలెను. గుమ్మడికాయ, నూనె, ఉసిరి తినరాదు. స్వయంపాకంతో గుమ్మడికాయను దానం చెయ్యాలి.

**11 వ రోజు ఏకాదశి** | చదువవలసిన అధ్యాయము-11 | పేజీనెం-29

రాత్రి విష్ణుపూజ చేయాలి. భీష్మపూజ ఆచరణీయం. పులపు తినరాదు. దక్షిణ తాంబూలాదులతో విభూది పండు దానిమివ్వాలి.

**12 వ రోజు ద్వాదశి** | చదువవలసిన అధ్యాయము-12 | పేజీనెం-31

ఈరోజు క్షీరాబ్ధి ద్వాదశిరోజు . ఉసిరి,తులసిమొక్కలదగ్గర దామోదరుడ్ని పూజించి దీపారాధన చెయ్యాలి. ఉప్పు,పులుపు,కారంతినరాదు. ఈరోజు స్వయంపాకంతో దక్షిణ తాంబూలం రాగి, పరిమళ ద్రవ్యాలు దానమివ్వాలి.

**13 వ రోజు త్రయోదశి** | చదువవలసిన అధ్యాయము-13 | పేజీనెం-33

సాలిగ్రామ దానం చేయదగిన రోజు. రాత్రి భోజనం ఉసిరి తినరాదు. ఈ రోజు దక్షిణ తాంబూలాదులతో పరిమళపుష్పములు దానం ఇవ్వాలి.

**14 వ రోజు చతుర్దశి** | చదువవలసిన అధ్యాయము-14 | పేజీనెం-35

చతుర్దశి వ్రతదినం ఉప్పు,పులుపు కారం తినరాదు. ఈరోజు శనికి ప్రీతికరమగు ఇనుము ,నువ్వులు దానమివ్వాలి.

**15వ రోజు పూర్ణిమ** | చదువవలసిన అధ్యాయము-15 | పేజీనెం-36

ఇష్టపదార్థాలను పులుపుతినరాదు. సాయంకాలం నదీస్నానంచేసి వరుణదేవుని పూజించాలి. ఈ రోజు దక్షిణతాంబూలాదులతో వెండిని, అన్నదానం చెయ్యాలి.

**16 వ రోజు బహుళ పాడ్యమి** | చదువవలసిన అధ్యాయము-16 | పేజీనెం-38

ఉల్లి,ఉసిరి,చద్దిచల్ల నిషిద్ధాలు, ఈరోజు దక్షిణతాంబూలాదులతో బంగారం,నెయ్యిశాకదానం చెయ్యాలి.

**17 వ రోజు విదియ** | చదువవలసిన అధ్యాయము-17 | పేజీనెం-40

వనభోజనము శ్రేష్ఠము ఉల్లి,ఉసిరి,చద్ది,చల్ల,ఎంగిలి తగిలినవి నిషిద్ధాలు. ఈరోజు దక్షిణతాంబూలాదులు స్వయంపాకంతో ధన దానమివ్వాలి.

**18 వ రోజు తదియ** | చదువవలసిన అధ్యాయము-18 | పేజీ నెం-41

తులసిమాలనుబ్రాహ్మణునకు దానమివ్వాలి. ఉసిరితినరాదు. ఈరోజు నవగాయ పిండివంటలతో తగు మందికి అన్నదానం చెయ్యాలి.

**19 వ రోజు తదియ** | చదువవలసిన అధ్యాయము-18 | పేజీనెం-42

గరికతో విఘ్నేశ్వరుణ్ణి పూజించాలి. నెయ్యి, నూనె, ఉసిరి మొదలగునవి నిషిద్ధాలు. ఈ రోజు వరి (బియ్యం) పిండితో చేసిన కుడుములు, నువ్వులు దానం ఇవ్వాలి.

**20 వ రోజు తదియ** | చదువవలసిన అధ్యాయము-18 | పేజీనెం-44

భూతప్రీతికై చీమలకు పంచదారచల్లడం కుక్కలకు అన్నం పెట్టుటమంచిది.పాలు మాత్రమే ఆహారంగాతీసుకోవలెను. ఈ రోజు మీశక్తికొలదిబంగారం గోదానం,భూదానంచెయ్యాలి.

# కార్తీకమాసం 30 రోజులు చేయవలసిన విధులు

| 21 వ రోజు షష్ఠి | చదువవలసిన అధ్యాయము-21 | పేజినెం-44 |
|---|---|---|

గ్రామదేవతను పూజించవలెను. పంటితో తినే పదార్థాలను తినరాదు. ఉసిరి తీసుకోరాదు. ఈ రోజు మీ శక్తికొలది సమస్తదానాలు చెయ్యవచ్చును.

| 22 వ రోజు సప్తమి | చదువవలసిన అధ్యాయము-22 | పేజినెం-45 |
|---|---|---|

జిల్లేడు పువ్వులతో మాలకట్టి ఈశ్వరునకు సమర్పించవలెను. ఉసిరి, తులసి వర్జితాలు ఈరోజు పట్టువస్త్రం,గోధుమలు,బంగారం దానమివ్వాలి.

| 23 వ రోజు అష్టమి | చదువవలసిన అధ్యాయము-23 | పేజినెం-46 |
|---|---|---|

కాలభైరవుని పూజించి గారెలదండ గ్రుచ్చి కుక్కమెడలో వేయవలెను. ఉసిరి తినరాదు. ఈ రోజు చీర,పసుపు,కుంకుమ,పువ్వులు,ముత్తైదువుకు దానమివ్వాలి.

| 24 వ రోజు నవమి | చదువవలసిన అధ్యాయము-24 | పేజినెం-48 |
|---|---|---|

బ్రాహ్మణునకు ఉదక దానమివ్వాలి. పులుపు పదార్థాలు తినరాదు. ఈరోజు చీర రవిక గాజులు నువ్వులు అన్నికూడా ఎరుపురంగువి దానమివ్వాలి.

| 25 వ రోజు దశమి | చదువవలసిన అధ్యాయము-25 | పేజినెం-49 |
|---|---|---|

అన్నదానం చెయ్యాలి. ఉపవాసముండాలి. ఈరోజు దక్షిణ తాంబూలాదులతో బ్రాహ్మణునకు స్వయంపాకం ఇవ్వాలి.

| 26వ రోజు ఏకాదశి | చదువవలసిన అధ్యాయము-26 | పేజి నెం-51 |
|---|---|---|

దీపారాధన,పురాణశ్రవణం చెయ్యాలి. ఉసిరి,ఉల్లి,వంకాయ తినరాదు. ఈ రోజు దక్షిణతాంబూలాదులతో అపరిదినుసులు (పప్పులు) దానమివ్వాలి.

| 27 వ రోజు ద్వాదశి | చదువవలసిన అధ్యాయము-27 | పేజినెం-52 |
|---|---|---|

అన్నార్తులకు అన్నంపెట్టి బ్రాహ్మణులకు స్వయంపాకం ఇవ్వవలెను. ఉల్లి,ఉసిరి, గుమ్మడి,వంకాయ నిషిద్ధాలు. ఈరోజువెండి,బంగారం,ధనం.ఉసిరికాయలు దానమివ్వాలి.

| 28 వ రోజు త్రయోదశి | చదువవలసిన అధ్యాయము-28 | పేజినెం-53 |
|---|---|---|

ఆలయంలో నవగ్రహారాధన చేసిఉపవాసం ఉండాలి. ఉసిరినిషిద్ధం. ఈరోజు ఉసిరికాయలు,నవ్వులు దానమివ్వాలి.

| 29 వ రోజు చతుర్దశి | చదువవలసిన అధ్యాయము-29 | పేజినెం-54 |
|---|---|---|

ఈరోజు మాసశివరాత్రికి శివారాధనచేసి పగలుఉపవాసముండవలెను. ఉసిరి తినరాదు. ఈరోజుదక్షిణతాంబూలాదులతో మీ శక్తికొలది బంగారం శివలింగం విభూదిపండు దానమివ్వాలి.

| 30 వ రోజు అమావాస్య | చదువవలసిన అధ్యాయము-30 | పేజినెం-57 |
|---|---|---|

పితృదేవతలను ఉద్దేశించి బ్రాహ్మణులకు స్వయంపాకంఇవ్వవలెను. పగలు ఉపవాస ముండవలెను. ఉసిరితినరాదు. ఈ రోజు మీ పితృదేవతలకు ప్రీతికరమగు (తర్పణలు) వస్తువులుదానమివ్వాలి. అఖరునదీపారాధనచేసి కొబ్బరికాయకొట్టి నమస్కరించవలెను.

# కార్తీకమాస నియమాలు

1. పాడ్యమి : మహాన్యాస పూర్వక రుద్రాభిషేకము చేయగలరు.
2. విదియ : శివాష్టోత్తరశతనామావళి 12మార్లు పారాయణచేయగలరు.
3. తదియ : చంద్రశేఖరాష్టకమ్ 8 మార్లు పారాయణ చేయగలరు.
4. చవితి : గణనాయకాష్టకమ్ 8 మార్లు పారాయణ చేయగలరు.
5. పంచమి : శివపంచాక్షరీ స్తోత్రమ్ 8 మార్లు పారాయణ చేయగలరు.
6. షష్ఠి : సుబ్రహ్మణ్యాష్టకమ్ 8 మార్లు పారాయణ చేయగలరు.
7. సప్తమి : బిల్వాష్టకమ్ 8 మార్లు పారాయణ చేయగలరు.
8. అష్టమి : రుద్రకవచమ్ 11 మార్లు పారాయణ చేయగలరు.
9. నవమి : శివస్తోత్రమ్ 11 మార్లు పారాయణ చేయగలరు.
10. దశమి : విశ్వనాథాష్టకమ్ 8 మార్లు పారాయణ చేయగలరు.
11. ఏకాదశి : ఏకాదశ మహాన్యాసపూర్వక రుద్రాభిషేకమ్ చేయించుకోగలరు.
12. ద్వాదశి : క్షీరాబ్ధి ద్వాదశి వ్రతము ఆచరించవలెను.
13. త్రయోదశి: శనికి తైలాభిషేకము చేయించుకొనగలరు.
14. చతుర్దశి : శివాష్టకమ్ 8మార్లు పారాయణ చేయగలరు.
15. పూర్ణిమ : కేదారేశ్వరవ్రతము ఆచరించవలెను.
16. బ.పాడ్యమి: లింగాష్టకమ్ 8 మార్లు పారాయణ చేయగలరు.
17. విదియ : రుద్రాష్టకమ్ 8 మార్లు పారాయణ చేయగలరు.
18. తదియ : ఉమామహేశ్వరాష్టకమ్ 8 మార్లు పారాయణ చేయగలరు.
19. చవితి : సంకటనాశనగణేశస్తోత్రమ్ 8 మార్లు పారాయణ చేయగలరు.
20. పంచమి : శివనామావళ్యాష్టకమ్ 8 మార్లు పారాయణ చేయగలరు.
21. షష్ఠి : సుబ్రహ్మణ్యకరావలంబస్తోత్రమ్ 8మార్లు పారాయణ చేయగలరు.
22. సప్తమి : శివద్వాదశనామస్మరణమ్ 12మార్లు పారాయణచేయగలరు.
23. అష్టమి : పార్వతీవల్లభ నీలకంఠాష్టకమ్ 8 మార్లు పారాయణ చేయగలరు.
24. నవమి : ఉమామహేశ్వరస్తోత్రమ్ 11 మార్లు పారాయణ చేయగలరు.
25. దశమి : శివమానసపూజాస్తోత్రమ్ 11 మార్లు పారాయణ చేయగలరు.
26. ఏకాదశి : శ్రీ సత్యనారాయణ వ్రతము ఆచరించవలెను.
27. ద్వాదశి : ద్వాదశజ్యోతిర్లింగస్తోత్రమ్ 8 మార్లు పారాయణ చేయగలరు.
28. త్రయోదశి: శనికి తైలాభిషేకము చేయించగలరు.
29. చతుర్దశి : శివప్రాతఃస్మరణస్తోత్రమ్ 11 మార్లు పారాయణ చేయగలరు.
30. అమావాస్య: శతరుద్రీయమ్ పారాయణతో అభిషేకము చేయగలరు.

# దీపదానం DC

దీపదానం DC

సాయంకాలం ప్రదోషసమయంలో నువ్వులనూనెతో దీపాలు పెట్టాలి. బ్రహ్మవిష్ణు శివాలయాలలోనూ, మఠము లందునూ ఇవి పెట్టవలెను.

అమావాస్యా చతుర్దశ్యోః ప్రదోషే దీపదానతః|

యమమార్గే దికారేభ్యోముచ్యతే కార్తికే నరః||

ఇక్కడ 'కార్తికే' అన్నమాట పూర్ణిమాంత మాసపక్షము. మన దేశంలో అమావాస్యాంత మాసపక్షం అమలులో ఉన్నందున. మనకిది ఆశ్వయుజమే.

ఉల్కాదానం (దివిటీలు):-

దక్షిణదిశగా (యమలోకంవైపు) మగపిల్లలు నిలబడి పితృదేవతలకు త్రోవ చూపుటకుగాను దివిటీలు వెలిగించి చూపవలెను. పిమ్మట పిల్లలు కాళ్ళుకడుగుకొని లోపలికి వచ్చి మధుర పదార్థం తినాలి.

లక్ష్మీపూజ:-

దీపములు వెలిగించి అందు లక్ష్మిని ఆహ్వానించి లక్ష్మీపూజ చేయవలెను. రాత్రి జాగరణం చేయాలి.

అర్ధరాత్రి పౌరస్త్రీలు చేటలు, డిండిమలు, వాద్యములు వాయించుచు, అలక్ష్మిని తమయింటినుండి దూరంగా కొట్టివేయాలి. దీనిని అలక్ష్మీ నిస్సరణమని అంటారు.

విష్ణుమూర్తిని నరక చతుర్దశినాడూ, అమావాస్య మరునాడూ పాతాళంనుంచి వచ్చి తాను భూలోకాధికారం చేసేటట్లూ, ఈనాడు లక్ష్మీపూజ చేసిన వారి ఇంట లక్ష్మీ శావ్వతంగా ఉండవలెననీ బలివరం కోరుకొన్నాడట. కావున భగవత్సంకీర్తనతో రాత్రి జాగరణం చేయాలి.

అలక్ష్మీ నిస్సరణానికి, డిండిమాదులు వాయించటం, ఉల్కాదానం వీనికి చిహ్నములుగా టపాకాయలు పేల్చి చప్పుడు చేయటం, కాకరపువ్వువత్తులు, బాణసంచా కాల్చడమూ, ఆచారంగా, సంప్రదాయంగా ఏర్పడింది. వరఋతువులో తేమేర్పడగా అప్పుడు పుట్టిన క్రిమికీటకాదులు దీపం మీద వ్రాలి క్రిమిజన్మనుండి ముక్తిపొందుతాయి. తద్ద్వారా వానికి ముక్తి. అందుకనే కార్తికమాసం అంతా దీపదానానికి చెప్పబడింది. అకాశదీపంకూడా అప్పుడే.

'జ్ఞాత్వా కర్మాణి కుర్వీత-' తెలిసి చేసినా తెలియక చేసినా ఫలం వస్తుంది. కాని తెలిసిచేయడం జ్ఞానంతో చేయడం దానితో మనకు ఆనందం కలుగుతుంది. కావున ఈ ఆచారాలన్నీ, సంప్రదాయాన్ని అందిస్తూ సచ్చిదానంద పరబ్రహ్మానుభవాన్ని సూచిస్తున్నవని మనం తెలుసుకోవాలి.

NDC

దీపారాధన ఫలితాలు

దీపం జ్యోతిః పరబ్రహ్మ దీపంజ్యోతిః నమో నమః

దీపేన హరతేపాపం దీప దేవి నమో నమః

దీపం పర బ్రహ్మ స్వరూపం. పరాయణత్వం కలిగింద్దై. పాప ప్రక్షాళన చేయును. మన ఇంట సిరులు ఇచేది దీపజ్యోతియే ! అట్టి దీపదేవికి నమస్కరిస్తున్నాను.

దీపం జ్ఞానానికి చిహ్నం. నిర్లక్ష్యమన్న చీకటిని పారదోలే దివ్యజ్యోతి. ప్రతి ఇంట్లోనూ దేవుని ముందు ఉదయం, సాయంసంధ్యవేళ ఒకటి, రెండుసార్లు దీపారాధన చేయడం హిందూవుల ఆచారం. ఇళ్ళల్లో ఎప్పుడూ దీపం వెలుగుతూనే ఉంటుంది. దీనిని "అఖండ" దీపం అంటాము. అన్ని పవిత్ర సందర్భాలలోనూ జ్యోతి వెలిగించి ప్రారంభించే సంప్రదాయం మనకు ఉంది. దీప కాంతి చీకటిని పారదోలినట్లే, జ్ఞానం నిర్లక్ష్య ధోరణిని నిర్మూలిస్తుందంటున్నారు పెద్దలు. అందుకే అన్ని రూపాల్లోని సంపద అయిన గొప్ప జ్ఞానాన్ని సముపార్జించుకోవడం కోసం, అన్ని పవిత్ర సందర్భాలలోనూ మన ఆలోచనలకు, చర్యలకు సాక్ష్యంగా జ్యోతి వెలిగిస్తాము. సంప్రదాయబద్ధంగా వెలిగించే నూనే దీపానికి ఆధ్యాత్మిక గుర్తింపు ఎక్కువుగా ఉంటుంది. దీపపు కుందిలో పోసే నెయ్యి లెదా నూనె, వత్తి మనలోని కోరికలు, అహంభావ ధోరణులకు సంకేతం. భగవంతుని ముందు దీపం వెలిగించగానే మనలోని కోరికలు నెమ్మదిగా ఆవిరవుతూ, అహం కాలిపోతూ వుంటుందని అర్థం చేసుకోవాలి.

రాతి యుగంలో రాతినే దీపపు సెమ్మెలుగా మలచి దీపారాధన చేసేవారు.అలాగే రకరకాల గుళ్ళల్లలోనూ కూడ దీపారాధన కు ఉపయోగించేవారు. ఆ తరువాత మట్టి ప్రమిదలు వాడుకలోకి వచ్చేసాయి.ఆర్థికంగా ఉన్నవారు స్వర్ణదీపాలు, నవరత్నములు పొదిగిన దీపాల సెమ్మెలుగా మలచి దీపారాధన చేసేవారు.

దీపారాధనలు కొన్ని ప్రదేశాలలో వెలిగించడం వల్ల విశే షమైన ఫలితాలు ఇస్తాయి.
మనము ఇంట్లో చేసే నిత్య దీపారాధన ను "వ్యష్టి " దీపారాధన అంటారు. అంటే ఇంటికి వెలుగునిచ్చి, ఆ ఇంటిల్లిపాదికి ఐశ్వర్యసంపద కలిగించేది ....అలాగే దేవాలయాలలో చేసే దీపారధనకు దేవతల అనుగ్రహం కలుగుతుంది...విశే ష ఫలితాలు .తులసి కోట వద్ద చేసే దీపారాధనని " బృందావన" దీపారాధన అంటారు.
దేవుడికి ప్రత్యేకించి చూపించే దీపారాధనను "అర్చనా" దీపాలు అంటారు.
నిత్య పూజలలో ఉపయోగించే చిరుదీపాలను నిరంజన దీపాలంటారు.
గర్భగుడిలో వెలిగించే దీపాన్ని "నందా" దీపము అని అంటారు.
లక్ష్మిదేవి ఉన్న గర్భగుడిలో గుడిలో వెలిగించే దీపాన్ని "లక్ష్మి దీపం" అంటారు.
దేవాలయ ప్రంగణములోనున్న బలిపీఠం పై వెలిగించే దీపాన్ని ఆ దేవాలయ దృష్టి నివారణగా "బలిదీపం" అని అంటారు.ఆ సమీపాన ఉన్న ఎత్తూయిన స్థంబం పై వెలిగించిన దీపాన్ని "ఆకాశదీపం" అంటారు.

పంచాయతన దేవాలయాలలో దేవతలు.. శివుడు, విష్ణువు, అంబిక, గణపతి, ఆదిత్యుడు(సూర్యుడు) లున్న ఒక్కొక్క దేవత దగ్గర వెలిగించే దీపారధనకు వివిధ పేర్లు ఉన్నాయి. శైవరూపంలో నందిరూపంగా, నాగరూపంలో మేళవించిన దీపాలు కనిపిస్తాయి.

విష్ణువు వద్ద దీపకృతులు :శంఖు,చక్ర,గద,పద్మ"రూపాలు కనిపిస్తాయి.
ఏక ముఖం- మధ్యమం, ద్విముఖం - కుటుంబ ఐక్యత, త్రిముఖం-ఉత్తమ సంతాన సౌభాగ్యం, చతుర్ముఖం -పశుసంపద మరియు ధన సంపద, పంచముఖం సిరిసంపదుల వృద్ధి ఫలితములు ఉండును.
అలాగే మట్టి, వెండి పంచలోహాదుల ప్రమిదలు దీపారాధనకు వాడటం శ్రేష్టం.
వెండి కుందులు అగ్రస్థానం . పంచ లోహపు కుందులు ద్వితియ స్థనం.
దీపారాధన చేసే తప్పుడు తప్పనసరిగా ప్రమిదల క్రింద చిన్న పళ్ళేము పెట్టడం శ్రేష్టం. మట్టి ప్రమిదలో దీపారాధన చేస్తే, ఆ ప్రమిద క్రింద మరో ప్రమిద పెట్టాలి.
ఇంట్లో నిత్య దీపారాధన సంధ్యా సమయాలలో తప్పనసరిగ చెయ్యాలి. నిత్యం శుభఫలితాలను ఇస్తు, దుష్ట శక్తులు నశిస్తాయి. ఆ ఇంటా అందరు క్షేమముగా ఉంటారు.

దీపం వెలించడానికి ఒక వత్తి ఉపయోగించరాదు. ఒక వత్తి దీపం శవం ముందు వెలిగిస్తారు. అంటే జీవుడు పరమాత్మలో కలిశాడని అర్థం.దీపారాధనకు స్టీలు ప్రమిదలు ఎట్టి పరిస్థితుల్లో ఉపయోగించరాదు. అగ్గిపుల్లతో దీపం వెలిగించారాదు.

అగరబత్తీల ద్వారా వెలిగించవచ్చు. దీపం కొండెక్కితే "ఓమ్ నమః శివాయ" అని 108 సార్లు జపించి దీపం వెలిగించాలి. ఇలా చేయడం వల్ల ఎలాంటి కీడు జరగదు.

దీపారాధన తర్వాత మూడు చోట్ల కుంకుమ పెట్టి అక్షితలు వేస్తే మంచిది. సూర్యాస్తమయం నుంచి సూర్యోదయందాకా, దీపమున్న ఇంటిలో, దారిద్ర్యముండదు. దీపారాధన చేసేటప్పుడు ముందుగా నునె పోసి తర్వాత వత్తులు వేయాలి.



# దీపఫలం

పూర్వం సరస్వతీ నదీతీరంలో ఒక పాడుబడిన శివాలయం ఉండేది. అతి నిష్ఠాపరుడైన యోగి ఒకడు కార్తీక మాసంలో ఆ దేవాలయంలో గడుపుతూ పురాణ పఠనం చేయాలని సంకల్పించి, ఆలయాన్ని శుభ్రం చేసి, యథావిధిగా స్వామిని పూజిస్తూ తన సంకల్పాన్ని నెఱవేర్చుకోసాగాడు.

ఇలా ఉండగా ఒకరోజు ఎలుక ఒకటి దేవాలయంలో ప్రవేశించి తినడానికేదైనా దొరుకుతుందేమోనని వెదకసాగింది. ఎక్కడా ఏమీ దొరకక చివరకు దీపము వెలుగగా మిగిలిన వత్తిని నోటకరచుకొని పోబోయి అదృష్టంవల్ల ప్రక్కనున్న దీపం వద్ద ఆగింది. ఎలుక నోటిలోని వత్తి రెండవకొన దీపం దగ్గరకు ఉండటంవల్ల వెంటనే వెలిగింది. మరుక్షణంలో ఎలుక మానవాకారాన్ని పొందింది.

ధ్యానంలో ఉన్న యోగి కళ్ళు తెరచేసరికి ప్రక్కనొక మానవుడు నిలబడటం గమనించి వెంటనే "ఓయీ నీ వెవరు? ఎందులకు ఇట్లు నిలబడితివి?" అని ప్రశ్నించాడు.

అందులకతడు "యోగిపుంగవా! నేనొక మూషికాన్ని. రాత్రి ఆహారం కోసం ఆలయంలో ప్రవేశించి ఏమీ దొరకక చివరకు నేతివాసనతో కూడిన వత్తినే నోటకరచుకొని ప్రక్కననున్న దీపమువద్ద ఆగితిని. అంతట నా అదృష్టముకొలది వత్తి వెలుగుటచే నా పాపములన్నియు పోయినవి కాబోలు. వెంటనే పూర్వజన్మ ఎత్తితిని. కాని నేను ఎలుక జన్మను ఎందులకు ఎత్తితినో తెలియకున్నది. మహాను

భావులు యోగిపుంగవులు అయిన మీరు ఎటులైన నా సంశయమును తీర్చు"డని వేడుకొన్నాడు.

యోగి తన దివ్యదృష్టిచే అంతా తెలుసుకొని "ఓయీ పూర్వజన్మలో నీవొక బ్రాహ్మణుడవు. నిన్ను బాహ్లికుడని పిలిచేవారు. జైనబ్రాహ్మణుడవైన నీవు కుటుంబపోషణ కోసం వ్యవసాయంచేస్తూ ధనాశతో సంధ్యావందనాది నిత్యకర్మలూ దేవతాపూజలూ వదలిపెట్టేశావు. నీచులతో సహవాసం చేస్తూ మంచివారిని నిందించే వాడివి. ధనాశ పెరిగి ఎన్నో నీచమైన పనులుచేసి డబ్బుకూడబెట్టి ఎవ్వరికిని పెట్టక నీవును తినక డబ్బంతా నీ ఇంటి పెరటిలో పాతిపెట్టావు. మరణించిన పిదప ఎలుక జన్మ ఎత్తి పాపఫలాన్ని అనుభవిస్తున్నావు.

నేడు కార్తీక సోమవారం. శివుని సన్నిధిని దీపమును వెలిగించి పూర్వం చేసిన పాపాలను పోగొట్టుకోవడమేకాక, గొప్ప పుణ్యాన్ని సంపాదించావు. కనుకనే నీకు వెంటనే మనుష్యజన్మ ప్రాప్తించింది. కనుక నీ గ్రామానికి వెళ్ళి నీ పెరటిలో పాతిపెట్టబడిన ధనాన్ని తీసికొని దానధర్మాలుచేస్తూ సుఖంగా జీవించు. భగవంతుని పూజించుచూ మోక్షాన్ని పొందు" అని చెప్పాడు.

[ స్కాంద పురాణం ఆధారంగా ]



# దీపారాధన వివరములు



(సశాస్త్రీయ రుద్రాభిషేకవిధినుండి)



## — అఖణ్డ దీప విధి —

శ్లో॥ రుద్రాభిషేక పూజాదౌ - దీపం ప్రజ్వాలయేత్సుధీః
అఖణ్డ దీప హీనాయా - సా పూజా నిష్ఫలాభవేత్
(రుద్రకల్పే)

తా॥ రుద్రాభిషేక ప్రారంభమందు అఖండ దీపారాధన చేయవలయును. అఖండ దీపారాధన చేయకుండా చేసిన రుద్రాభిషేక పూజాదులు నిష్ఫలమగును.

## — దీప తైలాని —

శ్లో॥ కపిలాది ఘృతం చైవ తిలతైల మథాపివా
బిల్వాది వృక్ష తైలంచ, దీప తైల మిహోచ్యతే
(మేరుతంత్రే)

తా॥ కపిలగోవు నేయి, నువ్వులనూనె బిల్వాది వృక్షజాతుల యొక్క నూనె దీప తైలములని చెప్పబడినవి.

## — దీప తైల ఫలాని —

శ్లో॥ గో ఘృతాతే జ్ఞాన సిద్ధిశ్చ - మోక్ష ప్రాప్తిస్తతః పరం
సంపద్వృద్ధి ర్యశో వృద్ధి స్తిల తైలం దదాతి చేత్
(భవిష్యన్మహా పురాణం)

తా॥ ఆవునేయి దీపారాధన, జ్ఞానసిద్ధి, అంతమందు మోక్షప్రాప్తియని చెప్పబడినది. నువ్వులనూనె దీపారాధన సంపద్వృద్ధియు, కీర్తి వృద్ధియు అని భవిష్యన్మహా పురాణమున చెప్పబడినది.

— దీపవర్జ్యతైలాని —

శ్లో॥ ఏరణ్డ నిమ్బ తైలాదీన్ వర్జయే చ్ఛివ పూజనే
(మేరుతంత్రే)

తా॥ ఆముదము, వేపనూనె, ఆవనూనె, అవిశనూనె మొదలగు తైలములతో శివుని పూజించు సమయమున దీపారాధన చేయకూడదు.

— అఖండదీపప్రమాణమ్

శ్లో॥ దీపం సప్తాఙ్గుళో త్సేధం దర్శయే చ్ఛివ సన్నిధౌ

తా॥ శివసన్నిధిని 7 అంగుళముల ఎత్తులో అఖండ దీపారాధన చేయవలెను.

శ్లో॥ ఉత్తమాజస్య దీపస్య మానం సప్తాఙ్గుళో చ్ఛ్రయం
మధ్యమం త్ర్యఙ్గుళం ప్రోక్త మేకాఙ్గుళ్య ధమం స్మృతం

తా॥ అఖండ దీపారాధన 7 అంగుళముల యెత్తు కలిగిన ఉత్తమము 3 అంగుళముల యెత్తు కలిగిన మధ్యమము 1 అంగుళము ఎత్తు ఉన్న అధమము ధాన్యము గాని బియ్యముగాని పైన చెప్పబడిన ఎత్తునకు సరిపడ పోసి అందుపై అఖండ దీపపాత్ర నుంచవలెను.

దీపవర్తి లక్షణమ్

శ్లో॥ ఏక త్రి పఞ్చవా సప్త నవవర్తిర్యుతా తథా
మధ్య మాధమ దీపస్తు సప్తాఙ్గుళ సముచ్ఛ్రయః

తా॥ 1-3-5-7-9 వర్తులతో (దారములతో) కూడిన (పేనిన) వర్తితో వెలిగించిన దీపములు మధ్యమాధమ ఫలముల నిచ్చును 7 అంగుళముల ఎత్తులో వెలిగించినా ఉత్తమ దీపములు కానేరవు.

శ్లో॥ ద్వాత్రింశతే షోడశ ద్వాదశాష్ట వర్తి సు సంయుతా
మధ్య దీప సమాయుక్తా దీపలక్షణ ముచ్యతే

తా॥ 32-16-12-8 గాని చుట్టునూ దీపములనుంచి మధ్యదీపము లుంచవలెను. అనగా 32 సంఖ్య వత్తులతో దృఢముగా పేనిన వత్తి అఖండదీప పాత్రయొక్క మధ్యను వెలిగించి పాత్రలోనే మధ్య దీపమునకు చుట్టూ దీపములు పైన వివరించిన సంఖ్య ప్రకారము ఉంచవలయును.

## — దీపస్థానఫలమ్ —

శ్లో॥ అథాత స్సం ప్రవక్ష్యామి శివదం శివదీపకం
సర్వపాప ప్రశమనం సర్వోపద్రవ నాశనమ్॥

అన్యారభ్యః —

పూర్వద్వారా శ్రయే దీపః శివస్యాతి ప్రియం కరః
పశ్చిమే వృష్టయే దేయః శేషకార్యేషు చోత్తరే॥
(మేరుతంత్రే)

తా॥ మంగళప్రదమైన శివదీపము సర్వపాప హరము. సర్వోపద్రవనాశము అగుచున్నది. తూర్పుద్వారా సన్నిధినుంచిన దీపము ప్రీతికరము పశ్చిమ భాగమున పెట్టిన దీపమువలన వర్షము కురియును; మిగిలిన సర్వకామ్యములయందును ఉత్తర దిశను దీపారాధన చేయవలెను.

అన్యచ్చ॥— (గ్రంథాంతరే)

శ్లో॥ దక్షిణేఘృత దీపోస్యై తైల దీపస్తు శూలినః
వామే ప్రజ్వాల్య సద్భక్త్యా దేవ దేవస్య సన్నిధౌ॥

తా॥ ఆవునేతి దీపారాధన శివునకు కుడిభాగమునందునూ, నువ్వులనూనె దీపారాధన శివునకు ఎడమభాగము నందునూ ఉంచవలెను.

ఎస్.సత్యనరసింహాశర్మ

SM




## కార్తిక విధులు

### కార్తికవ్రత సంకల్ప ప్రార్థన

దామోదర! నమస్తేస్తు సర్వపాప వినాశన!
కార్తికస్య వ్రతం కర్తుం అనుజ్ఞాం దాతుమర్హసి.
నిర్విఘ్నం కురు దేవేశ ఆమాసం పురుషోత్తమ!

### కార్తిక నదీస్నానవిధి:

నాడీద్వయావశిష్టాయాం రాత్ర్యాం గచ్ఛేజ్జలాశయం,
తులసీమృత్తికాయుక్తః సవస్త్ర కలశో మునే.
ఆగత్య తోయనికటే తీరే సంస్థాప్య పాత్రకం,
పాదప్రక్షాళనం కృత్వా దేశకాలాది చోచ్చరేత్.
స్మరేద్గంగాదికా నద్యో విష్ణుశ్శర్వాది దేవతాః,
నాభిమాత్రే జలే స్థిత్వా మంత్రమేతదుదీరయేత్.

(బ్రాహ్మీ ముహూర్తానికి ముందుగానే తులసిపాదులోనున్న మట్టిని కొంచెం పట్టుకుని, నదీతీరానికి వెళ్ళి, పాదాలు కడుక్కుని, దేశకాలాదులతో సంకల్పం చెప్పుకుని, నాభిలోతులో ఉండే విధంగా జలాశయంలో నిల్చుని ఈ విధంగా ప్రార్థించి, స్నానాన్ని చెయ్యాలి)

"కార్తికేఽహం కరిష్యామి ప్రాతఃస్నానం జనార్దన!
ప్రీత్యర్థం తవ దేవేశ! దామోదర! మయా సహ
నిత్యే నైమిత్తికే కృత్వా కార్తికే పాపనాశన,
స్నానం చార్ఘ్యం ప్రదాస్యామి నిర్విఘ్నం కురు కేశవ!"
తీర్థాది దేవతాభ్యశ్చ క్రమాదర్ఘ్యాది దాపయేత్
(స్నానం అయ్యేక అర్ఘ్యప్రదానం ఈ విధంగా చెయ్యాలి):
"గృహాణార్ఘ్యం మయా దత్తం రాధయా సహితో హరే!
నమః కమలనాభాయ! నమస్తే జలశాయినే!
నమస్తేఽస్తు హృషీకేశ! గృహాణార్ఘ్యం నమోస్తుతే,
వ్రతినః కార్తికే మాసి స్నాతస్య విధివన్మమ
గృహాణార్ఘ్యం మయా దత్తం దనుజేంద్రనిషూదన!
కిరణా ధూతపాపా చ పుణ్యతోయా సరస్వతీ,
గంగా చ యమునా చైవ పంచనద్యః పునంతు మాం"
గంగాది నదులను కూడా స్మరిస్తూ అర్ఘ్యమివ్వాలి
(అన్యాసాం చ నదీనాం చ దద్యాదర్ఘ్యం యథావిధి,
జాహ్నవీ స్మరణం కుర్యాత్సర్వ తీర్థేషు మానవః)

### ఆకాశదీప ప్రార్థన

దామోదరాయ విశ్వాయ విశ్వరూపధరాయ చ,
నమస్కృత్వా ప్రదాస్యామి వ్యోమదీపం హరిప్రియం
నిర్విఘ్నం కురు దేవేశ! త్వయి భక్తిః ప్రవర్ధతాం
నమః పితృభ్యః ప్రేతేభ్యో నమో ధర్మాయ విష్ణవే,
నమో యమాయ రుద్రాయ కాంతారపతయే నమః

---

యత్కించిత్కురుతే పుణ్యం విష్ణుముద్దిశ్య కార్తికే,
తస్య క్షయం న పశ్యామి మయోక్తం తవ నారద!

కార్తికమాసంలో విష్ణువును ఉద్దేశించి ఏ చిన్నపాటి పుణ్యకార్యం చేసినా అది అక్షయమైన ఫలితాన్నిస్తుంది.

---

వాద్యకృత్పురుషశ్చాపి వాజపేయఫలం లభేత్.

భగవత్ప్రీతికై వాద్యాలను వాయించేవాడు వాజపేయ యజ్ఞాలను చేసిన ఫలాన్ని పొందుతాడు.

---

అస్మిన్ మాసే త్రయస్త్రింశద్దేవాః సన్నిహితా మునే,
అత్ర స్నానాని దానాని భోజనాని వ్రతాని చ,
తిల ధేనుం హిరణ్యశ్చ రజతం భూమి వాససీ,
గోప్రదానాని కుర్వంతి సర్వభావేన నారద,
తాని దానాని దత్తాని గృహ్ణంతి విధివత్సురాః,
యత్కించిద్దత్తం విప్రేంద్ర! తపశ్చైవ తథాకృతం,
తదక్షయ్యఫలం ప్రోక్తం విష్ణునా ప్రభవిష్ణునా,
పాపానాం మోక్షణశ్చైవ కార్తికేమాసి శస్యతే.

కార్తికమాసంలో 33కోట్ల దేవతలందరూ భూమియందు సన్నిహితులై ఉండడం వల్ల ఆ సమయంలో చేసిన స్నాన, వ్రతాదులు, బంగారం, వెండి, భూ, వస్త్ర, తిల గోదానాలు పాపాలను పోగొట్టి అక్షయమైన ఫలితాలనిస్తాయి.

DEWALI

## కార్తిక శుద్ధ విదియ -యమ(భగినీ) ద్వితీయనాటి విధులు:

సోదరికి నమస్కరించి చెయ్యాల్సిన ప్రార్థన:

"భగిని! సుభగే! భద్రే త్వదంఘ్రి సరసీరుహం,

శ్రేయసేఽథ నమస్కర్తు మాగతోఽస్మి తవాఽఽలయం".

సోదరి, సోదరునితో చెప్పవలసినది:

"అద్య భ్రాతరహం జాతా త్వత్తో ధన్యాఽస్మి మంగళా,

భోక్తవ్యం తేఽద్య మద్గేహే స్వాయుషే కులదీపక!.

కార్తికే శుక్లపక్షస్య ద్వితీయాయాం సహోదర!,

యమో యమునయా పూర్వం భోజితః స్వగృహేఽర్చితః"

మధ్యాహ్నం సూర్యుని నమస్కరిస్తూ పఠించాల్సిన యమ నామాలు:

యమో నిహంతా పితృధర్మరాజో వైవస్వతో దండధరశ్చకాలః,
భూతాధిపో దత్తకృతానుసారీ కృతాంతమేతత్ దశభిర్జపంతి.

యాతు భోజయతే నారీ భ్రాతరం భ్రాతృకే తిథౌ,
అర్చయేచ్చాపి తాంబూలైః న సా వైధవ్యమాప్నుయాత్.
భ్రాతృరాయుః క్షయో నూనం న భవేత్తత్ర కర్హిచిత్

(భగినీ ద్వితీయనాడు అన్నదమ్ములకు భోజనం పెట్టి, గౌరవించి, తాంబూలాదులు ఇవ్వడం వల్ల అన్నదమ్ముల ఆయుఃక్షీణం కాదు. సోదరికి వైధవ్యబాధ ఉండదు).

అశక్తస్తు యదా మర్త్యస్తద్దైవం వ్రతమాచరేత్,
అన్యస్మై ద్రవిణం దత్వా కారయేత్ కార్తికవ్రతం.
తస్మాత్పుణ్యం ప్రగృహ్ణీత దానసంకల్ప పూర్వకం.

కార్తికవ్రతాన్ని ఆచరించడానికి అశక్తుడైనవాడు, మరెవరికైనా ధన సమేతంగా కర్తృత్వాన్ని ఇచ్చి, సంకల్పపూర్వకంగా ఆ ఫలితాన్ని పొందవచ్చును.

అఖండితం తేన కార్తికవ్రతజం ఫలం,
విష్ణోః శివస్య వా కుర్యాదాలయే హరి జాగరం,
శివవిష్ణ్వోర్గృహాభావే సర్వదేవాలయేష్వపి.
దుర్గాటవ్యాం స్థితోవాఽథ యది చాఽఽపద్గతో భవేత్,
కుర్యాదశ్వత్థమూలేతు తులసీనా వనేష్వపి.

కార్తికంలో విష్ణు/శివ మందిరంలో జాగరణ వ్రతమాచరించాలి. అది కుదరనప్పుడు రావిచెట్టు లేదా తులసి సమీపంలో భగవదారాధనతో వ్రతాన్ని ఆచరించాలి.

ద్రవ్యదానేఽప్యశక్తశ్చేత్ యదా దేవర్షి సత్తమ!
తదా తేన ప్రకర్తవ్యం పాదం తీర్థజలస్య చ,
తత్రాఽప్యశక్తో యో మర్త్యస్తేన నిత్యం హరేర్ముదా,
స్మరణం చ ప్రకర్తవ్యం నామ్నా నియమ పూర్వకం

దానానికి అసమర్థుడైనవాడు, తీర్థజలాలని సేవించాలి. దానికి కూడా అశక్తుడైతే, నియమపూర్వకంగా హరిని స్మరించి కార్తికవ్రత ఆచరణ ఫలాన్ని పొందవచ్చును.

బ్రాహ్మణేభ్యో మహీం దత్వా గ్రహణే సూర్యచంద్రయోః,
యత్ఫలం లభతే వత్స! తత్ఫలం భూమి శాయినః.
కార్తికే క్షితిశాయీ చ హన్యాత్ పాపం యుగార్జితం.

కార్తికమాసంలో నేలపై పడుకునేవాడు, యుగాలనుండి ఉన్న పాపాలను పోగొట్టుకున్నవాడై, సూర్య/చంద్ర గ్రహణాదులలో బ్రాహ్మణులకు భూదానం చేసినవారు పొందే ఫలితాన్ని పొందగలడు.

విష్ణునామ ప్రబంధానాం గాయనం విష్ణుసన్నిధౌ,
గోసహస్ర ప్రదానస్య ఫలమాప్నోతి మానవః.

విష్ణునామాలను, స్తోత్రాలను విష్ణుసన్నిధిలో చదివినవాడు వేలకొలది గోదానాలు చేసిన ఫలితాన్ని పొందుతాడు.

రాధా దామోదరః పూజ్యః కార్తికేతు విశేషతః, దామోదరస్య
రాధాయాః తులస్యధో2ర్చయంతి యే,
మూర్తిం తే తు నరా జ్ఞేయా జీవన్ముక్తా న సంశయః.

కార్తికమాసంలో ముఖ్యంగా రాధా దామోదరులను పూజించాలి. వీరిని తులసి ఛాయలో పూజిస్తే వారు జీవన్ముక్తులవుతారనడంలో సందేహం లేదు.

కార్తికే మాసి సంప్రాప్తే కృత్వా కర్మాణి భూరిశః,
అకృత్వా గురుశుశ్రూషాం నరకానేవ విందతి.
యత్కించిద్వా సమాదిష్టో గురుణా తత్సమాచరేత్.

కార్తికమాసంలో ఎన్ని పుణ్యకర్మలు చేసినప్పటికీ, గురుశుశ్రూష చెయ్యనివాడు నరకాన్ని పొందుతాడు. కాబట్టి గురువు చెప్పినవి కాస్తయినా ఈ మాసంలో ఆచరించాలి.

# దీపేన సాధ్యతే సర్వం

|డా॥ ఎం. అహల్యాదేవి

ఇతరుల శ్రేయస్సు కోరి సేవలు చేస్తే అదే పెద్ద ధర్మాచరణ. దానితో భగవంతుడు సంతోషించి మంచి జరుగుతుంది.

ఇతరుల దారిలో దీపాలు వెలిగించి, తోవ చూపించే వారికి దేవుడు మంచి దిశానిర్దేశం చేస్తాడు. భార్యాభర్తలిద్దరూ కలసి దీపదానం చేయవచ్చు. భార్య తన భర్త, పిల్లల అభివృద్ధి కోసం చేయవచ్చు. దీపదానానికి ముందు తులసి పూజ చేయాలి. తులసిని పూజించి, తులసి దగ్గరే దీపదానం చేసి, లేక తులసి ఆకులను తీసుకొని చందనంతో పాటు భగవంతునికి అర్పించి, గుడి శిఖరం వైపుకు వెళ్ళి శిఖరాన్ని చూస్తూ భగవంతుని ధ్యానిస్తూ దీపదానం చేయాలి.



'కార్తికమాసంలో దీపదానం చేస్తే సమస్త పాపాలూ పటాపంచలవుతాయి' అని స్కందపురాణం చెబుతోంది.

దీని గురించి ఒక కథ ప్రచారంలో ఉంది.

పండితుడైన ఒక బ్రాహ్మణుని భార్య గయ్యాళి, కర్కశురాలు. ఆ బ్రాహ్మణుడు ఈవిడ బాధలు భరించలేక దుఃఖంతో స్వర్గస్థుడయ్యాడు.

ఆమెకు సోదరులు లేరు. సంతానం లేదు. ఇంటి ఖర్చులకు ధన రాబడి లేదు.

వాళ్లింట్లో, వీళ్లింట్లో అంట్లు తోమి ఎంగిలి తినేది.

ఎప్పుడూ భర్తతో అరవడమే కాని ఒక్కసారైనా భగవంతుని తలచుకోలేదు. పూజాపునస్కారాలు అసలు లేవు.

పోనీ ఎవరైనా మంచిమాట చెబితే వినేది కాదు.

పూర్వజన్మలో కాస్త పుణ్యం చేసిందేమో! ఆ అదృష్టం వల్ల ఒక పండితుడు అనుకోకుండా వీళ్ల ఇంటికి వచ్చాడు.

సంస్కారహీనంగా, కుబుద్ధితో ఉన్న ఆమెను చూసి- "ఓ మూర్ఖురాలా! జీవితాన్ని ఎందుకిలా పాడు చేసుకుంటున్నావు? ఈ శరీరం దుఃఖ కారణం, దాన్ని పోషించుకోవడానికి ఈ పాడు పనులు చేస్తున్నావా? ఈ శరీరం నశించేది. కాస్తంత భగవానుని తలచుకో!" అని పండితుడు బోధించాడు.

మూర్ఖునికి కూడా ఏదో ఒక మాట కనువిప్పు కలిగిస్తుంది.

అలాగే ఈ స్త్రీకి కూడా! పండితుని మాట ఆమె హృదయంలో నాటుకుంది.

"విప్రోత్తమా! నేను చేసిన పాపాల వల్ల నా దుఃఖం పెరిగిపోయింది. ఏదైనా ఉపాయం చెప్పండి" అని వేడుకుంది.

"కార్తికమాసం ప్రారంభం కాగానే సూర్యోదయానికి ముందే నిద్ర లేచి, కాలకృత్యాలు ముగించుకో. భగవంతుని కథలు విను. దేవాలయంలో తులసి దగ్గర, రావి చెట్టు మొదట్లో దీపం వెలిగించు. కార్తికమాసంలో చేసే ఈ పూజ స్త్రీలకు శ్రేయస్కరమైనది" అని పండితుడు చెప్పాడు.

ఆ మహిళ అలాగే ఆచరించి స్వర్గం పొందింది.

దీప దానానికి ధార్మిక మహాత్మ్యం ఉంది. కార్తికమాసంలో

వేడి తగ్గుతుంది. వాతావరణం మారి రాత్రి సమయం ఎక్కువౌతుంది. అటువంటప్పుడు మానవులకు హాని కలిగించే క్రిములు, జీవుల ఉత్పత్తి పెరుగుతుంది. ఉదయం త్వరగా నిద్రలేచి, తులసి, రావి, ఉసిరి, అరటి మొదలైన వృక్షాల మొదట్లో పవిత్ర నదుల్లో, సరోవరాల్లో, బావుల్లో, చెరువుల్లో, దేవాలయాల్లో దీపాలు వెలిగిస్తే సమాజ సేవ చేసిన ఫలితం కూడా వస్తుంది.

ఇతరుల శ్రేయస్సు కోరి సేవలు చేస్తే అదే పెద్ద ధర్మాచరణ. దానితో భగవంతుడు సంతోషించి మంచి జరుగుతుంది.

ఇతరుల దారిలో దీపాలు వెలిగించి, తోవ చూపించే వారికి దేవుడు మంచి దిశానిర్దేశం చేస్తాడు.

కార్తికమాసంలో చేసే ఆకాశ దీపదానంతో గొప్ప పుణ్యఫలం లభిస్తుంది. దేవాలయాల్లో, గోపురాలు, ధ్వజస్తంభాలపైన ఎత్తులో దీపాలు వెలిగిస్తారు. వాటిని 'ఆకాశదీపాలు' అంటారు.

సూర్యోదయం కంటె ముందు, సూర్యాస్తమయ సమయంలో వెలిగించాలి. ఇలా ఒక నెల రోజులు నియమంగా వెలిగించాలి.

ఒక సంవత్సరం కూడా చేయవచ్చు. ఈ దీపదానం వల్ల మానవులకు ఉన్నతి, ఐశ్వర్యాభివృద్ధి, పదోన్నతి కలుగుతాయి.

తెలివితేటలు ఉన్నా పైకి రావడానికి తగిన అవకాశాలు రాక పోవడం, వచ్చినా ఫలించకపోవడం ఇలాంటి స్థితిలో ఉన్న వారికి అభివృద్ధి కలిగిస్తుంది.

భార్యాభర్తలిద్దరూ కలసి దీపదానం చేయవచ్చు. భార్య తన భర్త, పిల్లల అభివృద్ధి కోసం చేయవచ్చు. దీపదానానికి ముందు తులసి పూజ చేయాలి. తులసిని పూజించి, తులసి దగ్గరే దీపదానం చేసి, లేక తులసి ఆకులను తీసుకొని చందనంతో పాటు భగవంతునికి అర్పించి, గుడి శిఖరం వైపుకు వెళ్ళి శిఖరాన్ని చూస్తూ భగవంతుని ధ్యానిస్తూ దీపదానం చేయాలి.

**దీపదాన మంత్రం –**

**దామోదరాయ విశ్వాయ విశ్వరూప ధరాయచ ।**
**నమస్కృత్వా ప్రదాస్యామి వ్యోమదీపం హరిప్రియమ్ ॥**

శ్రీమన్నారాయణుడిని ప్రసన్నం చేసుకోవడానికి ఆకాశదీపదానం చేసే వారికి జీవితం చివరి రోజుల్లో క్రూరముఖుడైన యముడిని చూసే అవసరం రాదు.

దీపదాన సందర్భంలో క్రింది మంత్రంతో శ్రద్ధగా ప్రార్థన చేయాలి.

**నమః పితృభ్యః ప్రేతేభ్యో నమో ధర్మాయ విష్ణవే ।**
**నమో యమాయ రుద్రాయ కాంతారపతయే నమః ॥**

పితృ దేవతలకు నమస్కారం. ప్రేతలకు నమస్కారం.




**తీర్థాని మునయో దేవాః యజ్ఞాః సర్వేఽపి కార్తికే,**
**నిత్యం ధాత్రీం సమాశ్రిత్య తిష్ఠంత్యర్కే తులా స్థితే.**
**యత్కించిత్కురుతే పుణ్యం ధాత్రీ ఛాయాసు మానవః**
**తత్కోటిగుణితం భూయాత్ నాత్ర కార్యా విచారణా.**
**కార్తికేతు విశేషేణ ధాత్రీ ఛాయాం సమాశ్రితః,**
**భోజనం కురుతే యస్తు స వైకుంఠమవాప్నుయాత్.**

సకల తీర్థములు, మునులు, దేవతలు, యజ్ఞములు అన్నీ కార్తికమాసంలో ఉసిరిక చెట్టును ఆశ్రయించుకుని ఉంటాయి. కనుక ఉసిరిక చెట్టు మొదలులో ఏ కాస్త పుణ్యకార్యం చేసినా అది కోటిగుణితమై అనంతమైన ఫలితాలనిస్తుందనడంలో సందేహం లేదు. అంతేకాక ఈ మాసంలో ఉసిరికచెట్టు నీడలో భోజనం చేసినవారు వైకుంఠాన్ని పొందుతారు.

ధర్మ స్వరూపుడైన నారాయణ భగవానునికి నమస్కారం. యమధర్మరాజుకు నమస్కారం. దుర్గమం, కఠినమైన దారిలో నడిచేటప్పుడు రక్షించే రుద్రునికి నమస్కారం.

ఈ మంత్రం పఠిస్తే విష్ణుభగవానునితో పాటు పితృ దేవతలు, ఇతర దేవతలు ప్రసన్నులవుతారు.

ఇంటికప్పుపై దక్షిణదిశగా దీపం పెట్టి పితృదేవతలను సంతృప్తి పరచాలి. పితృదేవతలు అప్రసన్నులైనట్లు భావిస్తే, కార్తికమాసమంతా ఉభయసంధ్యల్లో ఇంటికప్పుపై దక్షిణ దిక్కున దీపాన్ని పెట్టి వారిని ప్రసన్నం చేసుకోవాలి. దీనివల్ల గృహంలో శాంతి లభిస్తుంది. కార్తికమాసంలో నేతిదీపాలను వెలిగించడం ఉత్తమోత్తమం. శుక్ల, బహుళ పక్షాల్లోని ఏకాదశి తిథినాడు కర్పూరదీపం వెలిగించడం వల్ల సానుకూల ఫలితాలు పొందుతారు.

కుటుంబంలోని వ్యక్తుల నడవడిక సవ్యంగా లేకపోయినా, సంతానం తప్పుదారిన నడుస్తున్నా, విష్ణువు ఆలయానికి వెళ్ళి కర్పూరదీపం వెలిగించాలని స్కందపురాణం చెబుతోంది.